Licenced to Post without Prepayment (PMG/VJA/PWPP/5/2014)




స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి

*Longest Living Newspaper in Telugu Journalism*

# జమీన్‌రైతు

సంపుటి: 84 • సంచిక: 31 • 25-7-2014 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-




# రాజధాని ఎంపికలో బాబు ఒంటెద్దు పోకడ!

కొత్త రాజధాని విషయంలో ఒంటెద్దు పోకడ పోతున్నాడు చంద్రబాబు నాయుడు. తను అనుకొన్నదే జరగాలనే పట్టుదల చూపుతున్నాడు. రాష్ట్ర విభజనలో అత్యంత కీలక అంశం – కొత్త రాజధాని. ఆంధ్రులు విభజనను వ్యతిరేకించడానికి ఏకైక కారణం హైదరాబాద్ నగరాన్ని వదలుకోవాల్సి వస్తుందన్న ఆవేదన మాత్రమే. ఆ స్థాయి రాజధాని నిర్మించుకోవడం అంత సులభంగా జరిగే పని కాదన్నది అందరి అభిప్రాయం. కానీ విభజన జరిగిపోయింది. దాన్ని ఆపడం ఎవరి తరమూ కాలేదు. ఇప్పటి సమస్య కొత్త రాజధాని నిర్మాణం. దానికి డబ్బెక్కడ నుంచి వస్తుంది, ఎన్నేళ్లు పడుతుంది, హైదరాబాద్ స్థాయికి చేరుకోవాలంటే ఎప్పటికైనా సాధ్యమా వంటి ప్రశ్నలు చాలానే వున్నాయి. అసలు కొత్త రాజధాని ఎక్కడ కట్టాలి అన్నది మొదటి ప్రశ్న. రాజధానికి విశాలమైన భూమి కావాలి. ప్రభుత్వ కార్యాలయాలకు మాత్రమే కాక, అక్కడ స్థిరపడే ప్రజల నివాసాలు, జీవన వసతులకూ భూమి కావాలి. మంచి వాతావరణం వుండాలి. మంచి నీళ్లు కావాలి. రాష్ట్రంలోని అన్ని ప్రాంతాల ప్రజలూ సులభంగా వచ్చి పోవడానికి రవాణా వ్యవస్థ కావాలి. ఆస్పత్రులు, బడులు, విశ్వవిద్యాలయాలు, శిక్షణా సంస్థలు వంటివి ఏర్పడాలి. రాజధాని స్థల ఎంపిక ఈ ప్రాధామ్యాల ప్రకారం జరగాలి. కానీ చంద్రబాబు నాయుడు ఏ కారణం చేతనో విజయవాడ, గుంటూరుల మధ్య రాజధాని నిర్మించాలనే నిర్ణయానికి వచ్చేశాడు. ఆయన ఆలోచనలు ఆ ప్రాంతానికే పరిమితమౌతున్నాయి, అడుగులు అటే పడుతున్నాయి.

విజయవాడ రాష్ట్రానికి నడి బొడ్డు వంటి ప్రదేశం అన్నది నిజమే. కానీ అదొక్కటే ప్రామాణికం కాదు కదా? అక్కడ భూముల ధరలు ఆకాశంలో విహరిస్తున్నాయి. అసలు చాలినంత భూమి సేకరించడం అసాధ్యం. ఇప్పటికే ఎంతగానో అభివృద్ధి చెందిన ప్రాంతం అది. పైగా అక్కడి ప్రజల సంస్కృతీ, సాంప్రదాయాలు అందరినీ కలుపుక పోయే రీతిలో వుండవన్నది నిజం. ఆ మాట ఇప్పటిది కాదు. అరవై ఏళ్ల క్రితం విడివడినప్పుడు కూడా విజయవాడ రాజధాని అనే చర్చ వస్తే ఎన్జీరంగా, ప్రకాశం పంతులు, బెజవాడ గోపాలరెడ్డి వంటి ఆనాటి పెద్ద మనుషులందరూ ఏకోన్ముఖంగా వ్యతిరేకించారు. విజయవాడలో ఇతర ప్రాంతాల నుంచి వచ్చేవారు బ్రతకలేరనే భావన వెలిబుచ్చారు. అది నూటికి నూరు పాళ్లు నిజం. హైదరాబాదులో కూటికి లేనివాడి దగ్గర నుంచి కోటీశ్వరుల వరకు వేలాది మంది ఇతర ప్రాంతాల నుంచి వలస వచ్చి ఉద్యోగాలు, వ్యాపారాలు చేసుకొంటున్నారు. ఏ సమస్య లేదు. కానీ విజయవాడలో ఈ అరవై ఏళ్లలో ఇతర ప్రాంతాల నుంచి వలస వచ్చి చిన్నపాటి వ్యాపారం పెట్టుకొన్నవారూ లేరు. ఆ నగరం సంస్కృతి అదీ.

చంద్రబాబు రాజధాని తీసుకవెళ్లి అక్కడ పెట్టా

కొరవ 14వ పేజీలో



# ఇజ్రాయిల్ రాక్షసత్వం

పాలస్తీనా నగరాల మీద ఇజ్రాయిల్ సైన్యం జరుపుతున్న దాడులు మానవత్వానికే అపచారంగా పరిణమిస్తున్నాయి. మనం 21 శతాబ్దంలో నాగరిక సమాజంలో బ్రతుకుతున్నామా లేక మధ్య యుగాల నాటి దానవత్వాన్ని ఆవహింప చేసుకొంటున్నామా అన్నది అర్థం కావడం లేదు. పాలస్తీనాకు, ఇజ్రాయిల్ దేశానికి కొన్ని తరాలుగా విరోధం వుంది. జాతి వైరం అది. ఎన్ని శాంతి ప్రయత్నాలు జరిగినా సంధి కుదరలేదు. రోజు రోజుకూ ఇద్దరి మధ్య శతృత్వం పెరుగుతున్నదే తప్ప ఉపశమించడం లేదు. ఇజ్రాయిల్‌కు అమెరికా వత్తాసు వుంది. ఇందిరాగాంధీ వంటి అంతర్జాతీయ నేతలు బ్రతికి వున్నంత కాలం పాలస్తీనా ప్రజలకు ప్రపంచ దేశాల సానుభూతి లభించేది. ఆ తరం నేతలు అంతరించి, అంతర్జాతీయ దౌత్యం అంటే ఆర్థిక అవసరం మాత్రమే అన్న సూత్రం అమలులోకి వచ్చిన తర్వాత అరబ్ దేశాలు కూడా పాలస్తీనాకు దూరమైపోయాయి. అమెరికా భయంతో పాలస్తీనా పక్కన నిలబడే మనిషి లేకుండా పోయాడు. తీవ్రవాదంతో మాత్రమే తమను తాము రక్షించుకోక తప్పని దుర్గతి దాపురించింది వారికి. దాన్ని కారణంగా చూపి పాలస్తీనా జాతినే అంతం చేయడానికి అత్యంత కర్కశంగా ప్రవర్తిస్తున్నది ఇజ్రాయిల్.

గతవారం పది రోజులుగా వారు చేస్తున్న అకృత్యాలు అన్నీ ఇన్నీ కావు. యుద్ధ విమానాలను వాడి పాలస్తీనా ప్రజల మీద బాంబుల వర్షం కురిపిస్తున్నారు. సైన్యాన్ని పంపి, యుద్ధ ట్యాంకర్లు వాడి, అమాయక ప్రజలను ఊచ కోత కోస్తున్నారు. సైన్యం ఎట్టి పరిస్థితులలోనూ సామాన్య ప్రజల మీద తుపాకీ ఎక్కు పెట్టకూడాదన్నది యుద్ధ నియమం. కానీ ఇక్కడ ఆ నియమం పాటించడం లేదు. కన్పించిన వాడిని కన్పించినట్లు కాల్చి పారేస్తున్నారు. ఏ ఆయుధమూ ఆత్మరక్షణకు చేతిలో లేని స్త్రీలను, పసి పిల్లలను కూడా మట్టు బెడుతున్నారు. పాఠశాలల మీద ఆస్పత్రుల మీద బాంబుల వర్షం కురిపిస్తున్నారు. ఇప్పటివరకు దాదాపు 750 మంది పాలస్తీనా పౌరులు మరణించారని తెలుస్తున్నది. కనీసం 10వేల మంది తీవ్రంగా గాయపడి అల్లాడుతున్నారు. వారికి వైద్య సహాయం అందించేవారు లేరు. ఆస్పత్రులన్నీ ఇజ్రాయిల్ బాంబులకు లక్ష్యంగా మారడంతో డాక్టర్లెవరూ ఆస్పత్రులకు రావడం లేదు. కొన్ని వందల ఇళ్లను నేలమట్టం చేశారు. అత్యంత భీతావహంగా, బీభత్సంగా వుంది పరిస్థితి. రాక్షసత్వం రాజ్యమేలుతున్నది.

ఈ దారుణాల పట్ల కనీస పాటి స్పందన చూపలేక పోతున్నది అంతర్జాతీయ సమాజం. రెడ్‌క్రాస్ అభ్యంతరాలు అరణ్య రోదనగా మారిపోతున్నాయి. ఒక్కటంటే ఒక్క దేశం కూడా ఇది అన్యాయమని ఇప్పటి వరకు ప్రకటన చేయ లేదు. అందరికీ అమెరికా అంటే భయం. వారికి ఇష్టంలేని పని చేస్తే డాలర్లు రావన్న భీతి. ఆర్థిక అవసరాలు దేశాలలో, ప్రపంచ పాలకులలో మానవత్వాన్ని హరింప చేస్తున్నాయి.

ఇజ్రాయిల్ ప్రభుత్వము, సైన్యము దారుణమైన యుద్ధ నేరాలకు పాల్పడుతున్నదని అందరికీ తెలుసు. ఐక్యరాజ్య సమితి మానవ హక్కుల సంఘం అధ్యక్షుడు నవీ పిళ్లై ఆ నిజాన్ని ఒప్పుకొన్నాడు. అమెరికా హోం మంత్రి ఇజ్రాయిల్‌లో మకాం పెట్టి వున్నాడే తప్ప, వారు చేస్తున్నది తప్పని చెప్పడం లేదు. ప్రపంచ శాంతిని కాపాడవలసిన ఐక్య రాజ్య సమితి అమెరికా ఒత్తిడితో మౌనంగా, ప్రేక్షక పాత్ర వహిస్తున్నది.

ఘోరము, దారుణమైన పరిస్థితి ఇది. బలహీనమైన దేశం మీద, ప్రజల మీద ఒక బలం కల్గిన దేశం అకృత్యాలకు పాల్పడుతుంటే, అమాయక పౌరులను ఊచకోత కోస్తుంటే నిలువరించలేని ఐక్య రాజ్య సమితి ఎందుకు? బలవంతుల దౌర్జన్యాలను, హింసను కాపాడే దగుల్బాజీ దుర్గతికి జారిపోయిన ఆ అంతర్జాతీయ సంస్థ వుండి ఏమి ప్రయోజనం.

పాలస్తీనా ప్రజలకు సంఘీభావం తెలుపవలసిన బాధ్యత ప్రజాస్వామ్యాన్ని, సంఘ జీవనంలో మానవత్వాన్ని కోరుకొనే ప్రతి ప్రపంచ పౌరుడి బాధ్యత. ఇజ్రాయిల్ అకృత్యాలను నిరసించడానికి ప్రపంచ పౌరులంతా తమ గళం విప్పవలసిన సమయం ఇది.

## జనవాణి

### సామాన్యుల బడ్జెట్లు కావు!

నరేంద్రమోడి నాయకత్వంలోని ఎన్డీఏ ప్రభుత్వం ప్రవేశపెట్టిన రైల్వే బడ్జెట్‌గానీ, సాధారణ బడ్జెట్‌గానీ నిశితంగా పరిశీలిస్తే ఇది తప్పనిసరిగా సంపన్నుల కొమ్ముకాసే ప్రభుత్వమని చెప్పకనే తెలిసి పోతుంది. రెండు బడ్జెట్‌లలోనూ పూర్తిగా పేద, బడుగు, బలహీన వర్గాల సంక్షేమమే విస్మరించారు. మరీ ముఖ్యంగా రైల్వే బడ్జెట్‌లో చిత్తూరు, నెల్లూరు, ప్రకాశం జిల్లాల వారికి తీరని అన్యాయం జరిగింది. పేదల కోసం కనీసం ఒక్క ప్యాసింజర్ రైలును కూడా ప్రవేశ పెట్టక పోవడం విచాకరకం. వారానికి ఒకసారి ఒకరైలు, వారానికి రెండు సార్లు నడిచే మరో రైలు ఎక్కడో ఉత్తరాది ప్రాంతంలో బయలుదేరి మన జిల్లా మీదుగా పోతుంటే వాటిల్తో సరిపెట్టుకోమంటున్నారు. బిట్రగుంటలో స్లీపర్ల తయారీ కేంద్రం ఊసేలేదు. భారతదేశంలో ఉన్న 30 కోట్ల మంది దారిద్రరేఖకు దిగువన ఉంటే వారి సంక్షేమం గూర్చి పట్టించుకొనే వారు. జపించేది స్వదేశీ విధానం, పాలనలో విదేశీ విధానం. ఇది ఎన్డీఏ సర్కారు తీరు. రెండు బడ్జెట్లపై కేంద్ర ప్రభుత్వంతో వాదించిన ఆంధ్రా ఎమ్పీలు లేరు.

వి.రవికుమార్ — నెల్లూరు

### బాలల చట్టాలు సరిచెయ్యాలి!

నేటి కాలమాన పరిస్థితులను బట్టి అత్యాచారానికి పాల్పడిన బాలలను సైతం పెద్దవారికి సమానంగా శిక్ష విధించడమే న్యాయం. ఇప్పటి బాలలు ఎంతో తెలివి మీరి ఉన్నారు. 16 ఏళ్ల వయస్సు దాటని వారికి శిక్ష, క్షమ ఉంటుందని ఎరిగి తప్పులు చేయడానికి వెనుకడడం లేదు. కేంద్ర మంత్రి శ్రీమతి మేనకా గాంధీ సైతం బాల నేరస్తులను పెద్దవారితో సమానంగా పరిగణించాల్సిందేనన్న అభిప్రాయాన్ని వ్యక్తం చేశారు. ఈ మధ్య జరిగిన అత్యాచార కేసులన్నింటిలో 16 ఏళ్ల లోపు పిల్లలే నిందితులుగా ఉన్నారు. శిక్షలు కఠినంగా ఉన్నట్లయితే టీనేజర్లు(బాలలు) అత్యాచారాల వంటి నేరాలు చేయను వెనుకంజ వేస్తారు. దీనికిగాను బాలల చట్టాన్ని సరిచెయ్యాల్సిన అవసరం ప్రభుత్వాలకుంది.

సోలా జానకీదేవి — నెల్లూరు

### దేవాదాయ శాఖకు విజ్ఞప్తి!

హైదరాబాద్ నుంచి సుందరకాండ పారాయణం కోసం అయోధ్యకు వెళ్లిన ఇరువురు వేదపండిత యువకులు సరయూ నదిలో పడి ప్రాణాలు కోల్పోవడం దురదృష్టకరం. వీరిరువురి ఆత్మలు శాంతిచుగాక. రెండు రాష్ట్రాల దేవాదాయ శాఖల వారు, తిరుమల తిరుపతి దేవస్థానం వారు స్పందించి ఆ రెండు కుటుంబాలకు అవసరమైన సాయంచేసి ఆదుకోవాలని విజ్ఞప్తి.

కాకుటూరి సుబ్రహ్మణ్యం — కావలి

## 70 ఏళ్ల క్రితం ఈవారం

**28-7-1944**
**పేజీలు:6 వెల: 0-1-6అణా**

### పల్లెటూళ్లు

### సర్వేపల్లి వార్తలు

మంచినీళ్ల బావి ప్రక్కన మూడు కుక్కలు చచ్చిపడి దుర్గంధము కొడుతుంటే మా గ్రామాధికార్ల ముక్కులకు సోకలేదే – కలరాలు అమ్మవార్లు ప్రబలమవతాయంటే ఇలాంటి అశుభ్రత వల్లనే గదా.

***

కిరసనాయిలు పంపకం, మునసబు పోస్టు మాస్టరులకు కూడా అందడం లేదంటేనే – ఏమి లెక్కలు ప్రభో.

### పరగడ పశువులు

బాపన తెల్ల యెద్దు ఒకటి తిక్కవరప్పాడులో పరగడవి వచ్చి యున్నది. స్వంతదార్లు వచ్చి తోలుక పోవచ్చును. అట్లే సర్వేపల్లిలో కూడా ఆవు ఒకటి వున్నది. కంటేపల్లి యిలాకా కోరకొమ్ముల బర్రె 20 రోజుల నుండి కనబడడం లేదు.

–ఒ.వి

### వి.ఆర్.కాలేజి

ప్రిన్సిపాలు : చివరకు తీర్మానమైంది. కాకినాడ వి.ఆర్.కాలేజి ఇంగ్లీషు లెక్చరరున్నూ, ఖద్దరుధారిన్నీ, వెంకటగిరిలో పౌరుల భక్తి విశ్వాసాలు చూరగొన్న డాక్టరు లక్ష్మీ భర్తయున్నూ, ఆంధ్ర యూనివర్శిటీలోని ఇంగ్లీషు లెక్చరర్లలో అద్వితీయుడు అని సి.ఆర్.రెడ్డిచే పేర్కొనబడిన సచ్చిదానం పిళ్లై గారిని(ఎం.ఏ) ప్రిన్సిపాలుగా నియమించారు. హిస్టరీ డిపార్ట్‌మెంట్ హెడ్‌గా చరిత్ర పరిశోధకుడు అలెగ్జాండరుMA(M.Litt) గారిని నియమించారు.

## 50 ఏళ్ల క్రితం ఈవారం

**24-7-1964**
**పేజీలు: 12 వెల: 0-20 న.పై**

### మే నెలలో వెంకన్న ఆదాయం 17 లక్షలు!

మే నెలలో ఏడుకొండల స్వామి ఆదాయం – కేవలం రొక్కంగా రూ.17,27,840లు అట. ఒక్క నెలలో ఇంత ఆదాయం యిప్పటికి ఎప్పుడూ రాలేదట. ఈ మొత్తంలో బంగారు వగైరాలు చేరలేదు.

పన్నులేని, ప్రజలను విసిగించినా అనుకొన్నంత ఆదాయం రాని మన ప్రభుత్వాలు; తన భక్తుల నుండి సులభంగా, సంతోషంగా యిన్ని లక్షలను యెట్లా రాబట్టుకోగలుగుతున్నడో ఆ రహస్యాన్ని ఆ వెంకన్న ద్వారా తెలిసి కోవడం బాగుంటుందేమో!

### నెల్లూరు ముచ్చట్లు

### 4 1/4 పదున్ల వర్షం

19, 20, 21 తేదీలలో నెల్లూరులో మొత్తం షుమారు 4 1/4 పదున్ల వర్షం కురిసింది. భూదేవి తాపం చల్లారింది.

ఈ రోజు నెల్లూరు ఆనకట్ట మీద 1.8 అడుగులు, సంగం ఆనకట్ట మీద రెండు అడుగుల నీరు ప్రవహిస్తున్నది.

### గూడూరు నికేతనం

గూడూరు శ్రీకాళిదాస కళానికేతన్ వారు యిటీవల పంచమ లలిత సంగీత పోటీలు మూడు రోజులు నిర్వహించారు. మూడవ రోజు సినిమా సంగీత దర్శకులు మాస్టర్ వేణు, నేపథ్యగాయని జానకిలను సన్మానించారు.

లలిత సంగీత విభాగంలో నెల్లూరు ఎస్పీ బాలసుబ్రహ్మణ్యం గారికి రెండు బహుమతులు లభించాయి.

# నెల్లూరు ముచ్చట్లు

## నన్నెవరూ కలవద్దు – ఫోన్ కూడా చేయవద్దు!

వెంకయ్యనాయుడు జాతీయ రాజకీయాలలో హిమాలయ శిఖర స్థాయికి ఎదిగాడని సంతోషపడే నెల్లూరీయులకు ఆయన ఇచ్చిన సందేశం – నన్నెవరూ కలవవద్దు, కనీసం ఫోన్ చేయడానికి కూడా ప్రయత్నం చేయవద్దు – అని. నెల్లూరు తొలి పర్యటనలో జరిగిన రెండు కీలక సభలలోనూ ఆయన ఈ సందేశాన్ని చాలా స్పష్టంగా విన్పించాడు. వెంకయ్య నాయుడుగారి ఉన్నతి నెల్లూరు నగర అభివృద్ధికి ఒక మహదవకాశం అన్న భావన సాధారణ ప్రజలలో కల్గినట్లే, ఆయన ప్రాభవం తమ వ్యక్తిగత జీవిత వికాసానికి కూడా ఉపకరిస్తుందన్న విశ్వాసం ఆయన్ను నమ్ముకొన్న వారిలో వుంది. మంచి రోజులు వచ్చాయన్న ఆశ అటువంటి వారిని ఉక్కిరి బిక్కిరి చేస్తున్నది. అంతమంది కోరికలు తీర్చడం, అందరినీ సంతృప్తిపరచడం తనకలివయ్యే పని కాదని వెంకయ్య నాయుడు గారికి బాగా అర్థమైందేమో, ఆ ఆశలను మొగ్గలోనే తుడిచేయండని స్పష్టం చేయడానికి ఈ సందేశం విన్పించాడాయన. పైగా మీరు ఫోన్ చేసినా నేను ఎత్తను అని కూడా చెప్పేశాడు. ఎంత ముందు జాగ్రత్తో చూడండి.

## చంద్రబాబును పొగిడిన వెంకయ్య!

ముఖ్యమంత్రి చంద్రబాబును కేంద్ర పట్టణాభివృద్ధి శాఖామంత్రి ముప్పవరపు వెంకయ్యానాయుడు ప్రశంసలతో ముంచెత్తారు. నెల్లూరు మెడికల్ కాలేజి ప్రారంభోత్సవ సభలో ఆయన మాట్లాడుతూ చంద్రబాబు ఎంతో అనుభవజ్ఞుడైన ముఖ్యమంత్రి. ఆయనో దార్శనికుడు; పనిచేయడమే ఆయన పని అటువంటి నాయకుడు ఇటువంటి క్లిష్టతర పరిస్థితులలో రాష్ట్ర ముఖ్యమంత్రిగా ఉండడం ప్రజలు చేసుకొన్న అదృష్టమన్నారు.

## చంద్రబాబును ఆకర్షించిన కొరమేను!

నెల్లూరు మెడికల్ కాలేజి ప్రారంభోత్సవానికి విచ్చేసిన ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు పెద్దాస్పత్రిలో వివిధ ప్రభుత్వ శాఖలు ఏర్పాటు చేసిన స్టాల్స్‌ను చూశారు. ఈ సందర్భంగా మత్స్యశాఖ ఏర్పాటు చేసిన స్టాల్‌లోని నెల్లూరు కొరమేను చేపల కూర ఘనతను కేంద్ర మంత్రి వెంకయ్యానాయుడు చెప్పగా విని ఆయన నోట్లో నీళ్లూరాయి. బహిరంగ సభలో నెల్లూరు కొరమేను చేపల పులుసు గూర్చి ప్రత్యేకంగా ప్రస్తావించారు. ఈ రకం చేపల సాగు జిల్లాలో విస్తృతం చేయను తనవంతు కృషి చేస్తానన్నారు. పాకిస్తాన్ మాజీ అధ్యక్షుడు ముషారఫ్ తన ఆగ్రా పర్యటనలో ఎంతో ఇష్టంగా తిని పార్శిల్ చేయించుకొని తీసుకెళ్లిన కొరమేను పులుసును నెల్లూరు తెలుగు తమ్ముళ్లు ఇంతవరకు చంద్రబాబుకు పెట్టకపోవడమేమిటి?

## వెంకయ్యానాయుడు ఉన్నారన్న ధైర్యం!

కేంద్రంలో వెంకయ్యానాయుడు గారు ఉన్నారన్న ధైర్యంతోనే రాష్ట్రంలో క్లిష్ట పరిస్థితులున్నా వివిధ పథకాలను నెరవేర్చను ధైర్యంచేసి వాగ్దానాలు చేస్తున్నట్లు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు చెప్పుకొచ్చారు. మెడికల్ కాలేజి ప్రారంభోత్సవ సభలో ఆయన మాట్లాడుతూ తెలుగు జాతి గర్వించతగ్గ వ్యక్తి వెంకయ్యానాయుడు. పోలవరం ప్రాజెక్ట్ ఆర్డినెన్స్ వెంకయ్యానాయుడు గారి చొరవ బయటకొచ్చింది. ఈ యేడాది రాష్ట్ర విద్యార్థులకు అదనపు ఎంబిబిఎస్ సీట్లు 900 ఆయనే తెచ్చారు. దక్షిణ భారతదేశంలోనే ఆయనో గొప్ప నాయకుడు. ఆయన అండ చూసుకునే రాష్ట్రంలో వివిధ అభివృద్ధి పథకాల ప్రకటనకు ముందంజ వేస్తున్నట్లు ముఖ్యమంత్రి చెప్పుకొచ్చారు.

## ప్రమాణ పత్రాలు చదివిందెవరు?

20వ తేది జరిగిన జిల్లా పరిషత్ సర్వసభ్య సమావేశంలో సభ్యుల చేత మూకుమ్మడిగా ప్రమాణాలు చేయించమని ఎన్నికల కమిషన్ ఆదేశించడంతో జిల్లా కలెక్టర్ నాగులాపల్లి శ్రీకాంత్ తాను ప్రమాణ పత్రం చదువుతూ సభ్యులను చదవమన్నారు. సమావేశం హాలులో రభస, కలెక్టర్ చెప్పింది వినపడకపోవడం వంటి సమస్యల వల్ల సగం మందికి పైగా సభ్యులు ప్రమాణ పత్రాలు చదవకుండానే లేచి కూర్చొని ఈ ముచ్చట ముగిసిందనిపించారు.

## మేం గెలుస్తామని తెలుసు!

జడ్పీ ఛైర్మన్ పీఠాన్ని లాటరీలో తాము గెలుస్తామని తనకు ముందే తెలుసని ఎన్నిక తర్వాత విలేకరులతో పిచ్చాపాటీగా మాట్లాడుతూ నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి చెప్పారు. నేను షిర్డీ సాయిబాబా భక్తుడిని. బాబాను మమ్మల్ని గెలిపించాలని కోరాను. ఆయన ధర్మాన్నే గెలిపిస్తారు. బాబా గెలిపించబట్టే బొమ్మిరెడ్డి రాఘవేంద్రరెడ్డి ఛైర్మన్ అయ్యారు. ఆయన గెలిస్తే పదిమందికి అన్నదానం చేస్తానని మొక్కుకొన్నా. ఆ పని ఈ రోజే చేస్తానని ఆధ్యాత్మికత జోడించి మరీ చెప్పాడాయన.

## ధర్మమే గెలిచింది!

నెల్లూరు జడ్పీ ఛైర్మన్ ఎన్నిక ఎన్ని మలుపులు తిరిగినా చివరికి ధర్మమే గెలిచిందని సర్వేపల్లి ఎమ్మెల్యే కాకాణి గోవర్ధన్‌రెడ్డి వ్యాఖ్యానించారు. ఎన్నిక అనంతరం విలేకరులతో మాట్లాడుతూ చివరి నిమిషంలో ముత్తుకూరు జడ్పీటీసిని తెలుగుదేశం వాళ్లు ప్రలోభ పెట్టను ప్రయత్నించినా అతను నీతి వైపే నిలబడినట్లు చెప్పారు.

## ఆరు గంటలకు విలేకరుల సమావేశం!

అసలే కొత్త మంత్రి గారు దానికి తోడు ఆయనకు సవాలక్ష బాధ్యతలు ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు అప్పజెప్పారు. అవీ – ఇవీ విలేకరులకు చెప్పాలంటే సమయం కుదరడం లేదు. అందుకే పురపాలక మంత్రి డాక్టర్ పొంగూరు నారాయణ 21వ తేది ఉదయం ఆరు గంటలకు మెడికల్ కాలేజిలో విలేకరుల సమావేశం పెట్టి నెల్లూరు జర్నలిస్టులకు పరీక్ష పెట్టారు. ఉదయాన్నే నిద్ర లేచే అలవాటున్న మీడియా మాత్రమే దీనికి వెళ్లడంతో ఈ సమావేశం పలుచ బారింది.

## ఫ్లెక్సీల్లో వెంకయ్య రికార్డు!

18, 19, 20 తేదీల్లో జిల్లా పర్యటనకు వచ్చిన కేంద్ర పట్టణాభివృద్ధి, పార్లమెంటరీ శాఖామంత్రి ముప్పవరపు వెంకయ్యానాయుడు పేరిట నెల్లూరులో సరికొత్త రికార్డు నమోదయ్యింది. ఆయన పర్యటన సందర్భంగా స్వాగతం చెబుతూ అన్ని పార్టీలు, వర్గాలు, వ్యక్తులు, సంస్థలన్నీ కలిపి పదివేలకుపైగా ఫ్లెక్సీలు ఏర్పాటు చేశారు. నగరంలో ఇప్పటివరకు జరిగిన ఏ కార్యక్రమానికి ఇన్ని ఫ్లెక్సీలు ఏర్పాటు చేయలేదన్న మాట. కాబట్టి ఇదో ఫ్లెక్సీల రికార్డుగా చెప్పుకోవాలి.

## ప్రైవేట్ స్కూల్స్ అసోసియేషన్

జిల్లా ప్రైవేట్ అన్‌ఎయిడెడ్ స్కూల్స్ మేనేజ్‌మెంట్ అసోసియేషన్ నూతన కార్యవర్గ ఎన్నిక ఇటీవల నెల్లూరులోని నేతాజీ ఫైలెట్ హైస్కూల్‌లో జరిగింది. ఈ సమావేశంలో మైథిలీ స్కూల్ కరస్పాండెంట్ మనోహర్‌రెడ్డి అధ్యక్షునిగా ఎన్నుకొన్నారు. కార్యదర్శిగా శారద స్కూల్ కరస్పాండెంట్ శ్రీనివాసులు, ట్రెజరర్‌గా శిల్పా స్కూల్ కరస్పాండెంట్ వై.మల్లిఖార్జున్‌రెడ్డి ఎన్నికయ్యారు.

## మూడేళ్లలో ఆ రైల్వే లైను పూర్తి!

రాబోయే మూడేళ్లలో కృష్ణపట్నం – ఓబులాపురం రైల్వేలైను పూర్తి చేయిస్తానని కేంద్ర మంత్రి వెంకయ్యానాయుడు హామీ ఇచ్చారు. 20వ తేది స్వర్ణ భారత్ ట్రస్ట్‌లో క్యాన్సర్ నిర్ధారణకు అవసరమైన ఎక్స్‌రే కేంద్రాన్ని ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ మెట్ట ప్రాంతాల్లో రైల్వేలైన్లు పూర్తి చేయాలన్నది తన చిరకాల స్వప్నమన్నారు. రైల్వే లైను వల్ల భూమి కోల్పోయిన రైతులకు ఎకరాకు 27లక్షల రూపాయలు నష్టపరిహారం అందిందని, తన సతీమణి ఉషమ్మకు సంబంధించి 30సెంట్ల భూమి కూడా దీనిలో ఉందని వెంకయ్యానాయుడు వివరించారు.

కొరవ 14వ పేజీలో

## సంస్మృతి



మా అమ్మ

**తూపిలి రమణమ్మ**

(జమీన్‌రైతు మేనేజింగ్ ఎడిటర్ స్వర్గీయ తూపిలి పార్థసారథిగారి భార్య)

30.7.92

**వనమాలి, ఉష, పేశల**

**మరియు**

**కుటుంబ సభ్యులు**






## ఉత్తరక్రియలు

మా తల్లిగారైన

**శ్రీమతి గుంటుపల్లి పుష్పావతి గారు**

తేది 18-07-2014 శుక్రవారం నాడు స్వర్గస్తులైనారు. వారి ఆత్మకు శాంతిని కలుగజేయమని భగవంతుని ప్రార్థిస్తున్నాము.

**ఉత్తరక్రియలు :**

తేది 28-07-2014 సోమవారం నాడు ఉదయం గుంటూరు జిల్లా, ప్రత్తిపాడు మండలం గొట్టిపాడు గ్రామంలోని మా స్వగృహమునందు జరుగును. కావున బంధుమిత్రులకు తెలియజేయడమైనది.

కుమారుడు :

**గుంటుపల్లి శ్రీనివాసరావు**

డిప్యూటీ సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్

డోర్ నెం.24-6-741, సిసియస్‌నగర్

LIC ఆఫీసు ఎదురువీధి, దర్గామిట్ట, నెల్లూరు.

ఫోన్ : 99496 29103, 0863 - 2280162



మెడికల్ కాలేజీని ప్రారంభిస్తున్న సిఎం చంద్రబాబు, కేంద్ర మంత్రి వెంకయ్యనాయుడు.

# వెంకయ్యనాయుడు వల్లే మెడికల్ కాలేజి వచ్చింది!

## ప్రారంభోత్సవ సభలో మంత్రి నారాయణ

19వ తేది నెల్లూరు నగరానికి సుదినమని చెప్పాలి. ఏళ్లు, పూళ్లుగా వస్తుందని ఊరిస్తుండిన మెడికల్ కాలేజి ప్రారంభమయ్యింది. హైటెక్ హంగులతో పెద్దాస్పత్రి ఆవరణలోనే కట్టిన మెడికల్ కాలేజీని ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు ప్రారంభించారు. కేంద్ర పట్టణాభివృద్ధి శాఖా మంత్రి వెంకయ్యనాయుడు, రాష్ట్ర మంత్రులు డాక్టర్ కామినేని శ్రీనివాస్, బొజ్జల గోపాలకృష్ణారెడ్డి, డాక్టర్ నారాయణ ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. అనంతరం పెద్దాసుపత్రి ఆవరణలో సభ ఏర్పాటు చేశారు. ఈ సభలో మునిసిపల్ మంత్రి డాక్టర్ నారాయణ మాట్లాడుతూ రాష్ట్రంలో ఈసారి తెలుగుదేశం ప్రభుత్వం వచ్చి ఉండకపోతే నెల్లూరులో మెడికల్ కాలేజి కల సాకారమయ్యేది కాదన్నారు. మెడికల్ కాలేజి ప్రారంభానికి సిద్ధంగాలేదని పరిశీలనకు వచ్చిన కమిటీ తేల్చి చెబితే ముఖ్యమంత్రి చంద్రబాబు ప్రత్యేక శ్రద్ధ తీసుకుని తనను, ఆరోగ్య మంత్రి కామినేని శ్రీనివాస్‌ను ఢిల్లీకి పంపగా, వెంకయ్యనాయుడు కేంద్ర ఆరోగ్య మంత్రితో మాట్లాడి అధికారులను ఒప్పించి ఒక్క రోజులోనే అన్ని అనుమతులు ఇప్పించారన్నారు. మరో ఐదేళ్లలో ఈ మెడికల్ కాలేజి సూపర్ స్పెషాలిటీ కోర్సుల బోధన చేసే స్థాయికి కూడా ఎదుగుతుందన్నారు. వెంకయ్యనాయుడు మాట్లాడుతూ ఈ రోజు నాకు చాలా ఆనందంగా ఉంది. 1968లో ఇక్కడ పెద్దాస్పత్రిని కర్ణాటక ముఖ్యమంత్రి వీరేంద్రపాటిల్ ప్రారంభించారు. ఆ సమయంలో నేను విద్యార్థిని. ఈ సమయంలో పెద్దాస్పత్రిని దూరదృష్టితో కట్టి మెడికల్ కాలేజీకి స్థలం ఎత్తిపెట్టిన దొడ్ల సుబ్బారెడ్డి గారిని మనం గుర్తుకు తెచ్చుకోవాలన్నారు. మెడికల్ కాలేజి కల సాకారమయ్యే దానిలో మాజీ ఆర్థిక మంత్రి ఆనం రామనారాయణరెడ్డి, ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు ప్రత్యేక శ్రద్ధ తీసుకొన్నారన్నారు. నేను నెల్లూరు ప్రాంత ప్రజాప్రతినిధిని కాను. కర్ణాటక నుంచి రాజ్యసభకు ప్రాతినిధ్యం వహిస్తున్నాను. నన్ను కొందరు ఆంధ్రా మంత్రిని అని విమర్శిస్తున్నారు. రాష్ట్ర విభజన సమయంలో ఆంధ్ర ప్రాంతానికి అన్యాయం జరిగింది. ఆ సమయంలో మూడు రాత్రులు నేను నిద్రపోలేదు. ఒక రోజు అర్థరాత్రి నా వ్యక్తిగత కార్యదర్శిని పిలిచి ఏమైతే అది అవుతుంది. ఆంధ్రప్రదేశ్‌కు జరిగిన అన్యాయంపై పార్లమెంట్‌లో మాట్లాడుతానన్నాను. మాట్లాడాను. ఆ రోజు కేంద్ర ప్రభుత్వం ఇచ్చిన హామీలు నెరవేర్చను ఇప్పటి ప్రభుత్వంలో మంత్రిగా నేను బాధ్యత స్వీకరించక తప్పడం లేదు. అందరూ అన్నీ చేయమంటారు. కానీ కేంద్రంలో ఆర్థిక పరిస్థితి కూడా అంతంతమాత్రంగా ఉంది. అన్నీ పంచాలంటే, కొన్నింటిని పెంచక తప్పదన్నారు. ప్రజలు కూడా సబ్‌కావ్ సర్కార్ కరేగా హమ్ బేకార్ బైఠేతో చలేగా (అన్ని పనులు ప్రభుత్వం చేస్తుంది. మనం విశ్రాంతిగా కూర్చుంటే చాలు) అనడం చెల్లదని వెంకయ్యనాయుడు స్పష్టం చేశారు. ఈ కార్యక్రమంలో ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు, ఆరోగ్యమంత్రి డాక్టర్ కామినేని శ్రీనివాస్, నెల్లూరు పార్లమెంటరీ నియోజకవర్గం తెలుగుదేశం పార్టీ ఇన్‌ఛార్జ్ ఆదాల ప్రభాకర్‌రెడ్డి, ఎమ్మెల్యేలు కురుగొండ్ల రామకృష్ణ, పోలంరెడ్డి శ్రీనివాసులు రెడ్డి, బొల్లినేని రామారావు, బీద మస్తాన్‌రావు, రవిచంద్ర, అనూరాధ, కలెక్టర్ శ్రీకాంత్, ఆరోగ్య శాఖలో ఉన్నత అధికారి మాజీ కలెక్టర్ ముద్దాడ రవిచంద్ర తదితరులు పాల్గొన్నారు.

## జడ్పీ ఛైర్మన్ పీఠంపై

# బొమ్మిరెడ్డి రాఘవేంద్రరెడ్డి!



ఛైర్మన్‌గా ఎన్నికయ్యాక ఎమ్పీ రాజమోహన్‌రెడ్డితో రాఘవేంద్రరెడ్డి, వైస్ ఛైర్మన్ శిరీష.

సస్పెన్స్, థ్రిల్లర్ సినిమాలా పలు మలుపులు తిరిగిన జిల్లా పరిషత్ ఛైర్మన్ ఎన్నిక ఎట్టకేలకు ముచ్చటగా మూడోసారి 20వ తేది పూర్తయ్యింది. వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ, తెలుగుదేశం పార్టీలకు 23 మంది జడ్పీటీసిల సమబలం ఉండడంతో లాటరీ పద్ధతిలో నిర్వహించిన ఈ ఎన్నికలో అదృష్టం వైకాపా జడ్పీ ఛైర్మన్ అభ్యర్థి బొమ్మిరెడ్డి రాఘవేంద్రరెడ్డిని వరించింది. వైస్ ఛైర్మన్ ఎన్నికకు ఇదే తరహాలో డ్రా తీయగా మళ్లీ అదృష్టం వైకాపాకే చెందిన సైదాపురం జడ్పీటీసి శిరీషను వరించింది. దీంతో ఒక్కసారిగా తెలుగుదేశం పార్టీ శిబిరంలో నిరాశనిస్పృహలు ఆవరించాయి. కోఆప్షన్ సభ్యునిగా తెలుగుదేశం పార్టీ తరపున పొదలకూరుకు చెందిన చాన్‌బాషకు అదృష్టం వరించింది. ఈ ఎన్నిక కోసం గత రెండు సమావేశాల్లో మాదిరిగానే భారీ పోలీస్ బందోబస్తు, జడ్పీ సమావేశపు హాలులో రెండు పార్టీల వారికి మధ్య బారికేడ్లతో సీటింగ్ ఏర్పాటు చేశారు. ఎమ్మెల్యేలు, ఎమ్పీలను, వైకాపా నుంచి తెలుగుదేశం పార్టీలోకి ఫిరాయించిన ఎనిమిది సభ్యుల కోసం కూడా విడివిడిగా బారెక్స్‌లు ఏర్పాటు చేశారు. గత రెండు సమావేశాల నిర్వహణలో విమర్శలపాలైన కలెక్టర్ తొలి నుంచి జాగ్రత్తగా వ్యవహరించి ఎన్నికను మెరుపు వేగంతో నిర్వహించారు. తొలుత కోఆప్షన్ సభ్యుని ఎన్నికను ఐదు నిమిషాల్లో పూర్తిచేసిన ఆయన మధ్యాహ్నం మూడు గంటల తర్వాత జడ్పీ ఛైర్మన్, వైస్ ఛైర్మన్ ఎన్నిక వారిచేత ప్రమాణ స్వీకారాలు 20 నిమిషాల్లో ముగించి వేశారు. ఎన్నిక ప్రశాంతంగా జరగడంతో పోలీస్, రెవిన్యూ, జడ్పీ ఉద్యోగులు ఊపిరి పీల్చుకున్నారు.

## వెంకయ్యనాయుడిని

# ఘనంగా సన్మానించిన బిజెపి!



పుష్పాలతో ప్రత్యేకంగా అలంకరించిన సింహాసనంపై వెంకయ్యనాయుడు.

కేంద్ర పట్టణాభివృద్ధి శాఖా మంత్రిగా బాధ్యతలు చేపట్టిన ముప్పవరపు వెంకయ్యనాయుడుకు బిజెపి ఘన సన్మానం నిర్వహించింది. ఆయన కేంద్ర మంత్రిగా నెల్లూరుకు మొట్టమొదటిసారి విచ్చేసిన సందర్భాన్ని పురస్కరించుకొని మినీబైపాస్ రోడ్డులోని అనిల్ గార్డెన్‌లో ఘన సన్మానం చేశారు. వెంకయ్యనాయుడు అభిమానులు, బిజెపి కార్యకర్తలు, నేతలు, వివిధ సంఘాల వారు పెద్ద సంఖ్యలో విచ్చేసి గజమాలలతో, పూల కిరీటాలను ఆయన తలపై అలంకరించి శాలువాలు కప్పి సన్మానించి తమ అభిమానాన్ని తెలియజెప్పారు. సన్మానాన్ని చాలాసేపు జరిగినా ఎవ్వరినీ నొప్పించకుండా ఓపికగా నిలబడి మరీ వారి సన్మానాన్ని అందుకొన్నారు వెంకయ్యనాయుడు. అనంతరం ఆయన చేసిన ప్రసంగం జిల్లాపై వెంకయ్య నాయుడుకు గల అభిమానాన్ని తెలియజెప్పింది. జిల్లాను అన్నివిధాల అభివృద్ధి చేసేందుకు తన శక్తిమేర కృషి చేస్తానని హామీ ఇచ్చారు. ఇప్పటికే జిల్లాలోని సమస్యలపై కలెక్టర్ నుంచి నివేదిక తెప్పించుకొన్నానని త్వరలో వీటన్నింటినీ పరిష్కరిస్తానన్నారు. ఈ సందర్భంగా ఆయన ఆర్‌ఎస్‌ఎస్‌తో తనకు గల అనుబంధాన్ని, అగ్రనేతలైన వాజ్‌పేయి, అద్వానీ రాక సందర్భంగా జిల్లాలో స్తంభాలు ఎక్కి జెండాలు కట్టడం, పోస్టర్లు అతికించడం వంటి వాటిని గుర్తు చేసుకొన్నారు. ఆర్‌ఎస్‌ఎస్‌లో పనిచేయడం వల్లనే క్రమశిక్షణ, మంచి నడవడిక అలవడ్డాయన్నారు. ప్రజలు కేంద్రంలో మోడిపైన నమ్మకంతో బలమైన మెజార్టీ వచ్చేలా చేసినా జిల్లాలో తిరుపతి, నెల్లూరులో పార్లమెంటు స్థానాలను, ఎమ్మెల్యే స్థానాలను తెలుగుదేశం, బిజెపి అభ్యర్థులను ప్రజలు గెలిపించక పోవడం పట్ల బాధను వ్యక్తం చేశారు. మునిసిపల్ మంత్రి డాక్టర్ నారాయణ వెంకయ్యనాయుడును రాజకీయ గురువుగా అభివర్ణించి, వెంకయ్యనాయుడుకు పాదాభి వందనం చేసి గురుభక్తిని చాటుకొన్నారు. రాష్ట్రానికి, జిల్లాకు మెడికల్ సీట్లు రావడానికి వెంకయ్యనాయుడు చేసిన కృషే కారణమని ఆరోగ్య శాఖా మంత్రి కామినేని శ్రీనివాస్ ప్రశంసించారు. నమ్మిన సిద్ధాంతాల కోసం కట్టుబడిన వ్యక్తి వెంకయ్యనాయుడుని, దేవాదాయ శాఖా మంత్రి మాణిక్యరావు కొనియాడారు. ఈ కార్యక్రమంలో బిజెపి జిల్లా అధ్యక్షుడు సురేంద్రరెడ్డి, రాష్ట్ర అధికార ప్రతినిధి ఆంజనేయరెడ్డి, రాష్ట్ర ప్రధాన కార్యదర్శి సన్నపురెడ్డి సురేష్‌రెడ్డి, రమేష్, కందుకూరి సత్యనారాయణ, వరదయ్య, వెంకటకృష్ణారెడ్డి పాల్గొన్నారు.

# వెంకటగిరి మండల పీఠం తెలుగుదేశం వశం!

**డక్కిలి, రాపూరు పీఠాలపై కూడా తెలుగు తమ్ముళ్లు**

వెంకటగిరి నియోజకవర్గంలో నియోజకవర్గ కేంద్రమైన వెంకటగిరి, డక్కిలి, రాపూరు మండల పీఠాలు తెలుగుదేశం పార్టీ వశమయ్యాయి. డక్కిలి మండల పరిషత్ అధ్యక్ష, ఉపాధ్యక్షుల ప్రమాణ స్వీకారోత్సవం ఇటీవల జరిగింది. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ హాజరయ్యారు. ఈ సందర్భంగా ఆయన పలు వాగ్ధానాలు చేశారు. చెరువులకు తెలుగుగంగ నీటిని అందించడంతోపాటు అసంపూర్తిగా వున్న ఎస్ఎస్ కాలువ నిర్మాణం పూర్తి చేయించి మెట్ట ప్రాంతమైన వెంకటగిరి రైతులకు సాగునీరు అందిస్తానన్నారు. చెన్నైకి గంగనీరు వెళ్తున్నా చెరువుల్లోకి నీరు తెచ్చుకోలేక పంటలు పండించుకోలేక పోతున్నామన్నారు. దీనిని దృష్టిలో వుంచుకొని చెరువులన్నింటికి తూములు ఏర్పాటు చేయిస్తామని, వీలుకాని చోట ఎత్తిపోతల పథకం ద్వారా గంగనీటిని మళ్లించడానికి కృషి చేస్తామన్నారు. డక్కిలి మండలం ఎప్పుడూ తెలుగుదేశానికి కంచుకోటగా వుందని, నాయకులు కార్యకర్తలు సమిష్టి కృషితో ఈ విజయం సాధించినట్లు వెంకటగిరి రాజ కుటుంబీకుడు సాయికృష్ణ యాచేంద్ర అన్నారు. డక్కిలి మండలాధ్యక్షుడుగా ఎన్నికైన పోలంరెడ్డి వెంకటరెడ్డిని, రాపూరు మండలాధ్యక్షురాలిగా ఎన్నికైన మోపూరు పద్మను పలువురు అభినందించారు. వెంకటగిరిలో మాత్రం టాస్ ద్వారా నక్కల మునెమ్మ ఎంపిక కావడం విశేషం.

# కావలిలో ఎంపిపి, ఎంపిటీసీలకు సన్మానం!

**ప్రజాభిమానం పొందమని 'బీద' సలహా**



బీద మస్తాన్‌రావును సన్మానిస్తున్న ఎంపిపిలు, ఎంపిటీసిలు.

కావలి మండల అధ్యక్షులు, తెలుగుదేశం ఎంపిటిసిల పదవీ స్వీకార కార్యక్రమం, అభినందన సభ జూలై 14న కావలి ఎమ్డీఓ కార్యాలయ ఆవరణలో జరిగింది. ఈ సన్మాన కార్యక్రమానికి ముఖ్యఅతిథిగా మాజీ శాసనసభ్యుడు బీద మస్తాన్‌రావు విచ్చేశారు. మండలాధ్యక్షురాలిగా ఎన్నికైన పత్రి మహేశ్వరిని, ఇతర తెలుగుదేశం పార్టీ ఎంపిటిసిలను బిఎంఆర్ మొదటగా ఘనంగా సన్మానించారు. పనిలో పనిగా కావలి రూరల్ మండలంలోని సర్పంచ్‌లను సన్మానించారు. అనంతరం వీరందరూ కలిసి బీద మస్తాన్‌రావుకు ఆత్మీయ సన్మానం చేశారు. ఆయన ఈ సందర్భంగా మాట్లాడుతూ తెలుగుదేశం పార్టీతోనే మహిళలకు రాజకీయ అవకాశాలు మెండుగా లభించాయన్నారు. వారికి ప్రత్యేక రిజర్వేషన్ కల్పించిన ఘనత ఎన్టీ రామారావుకే దక్కుతుందన్నారు. మున్సిపల్, మండలాల్లో మహిళలే అధికంగా ప్రాతినిధ్యం వహిస్తున్నారన్నారు. అందరిని కలుపుకొనిపోయి అభివృద్ధి కార్యక్రమాలు చేపట్టాలని సూచించారు. ఈ కార్యక్రమంలో కావలి మున్సిపల్ చైర్మన్ అలేఖ్య, వైస్ చైర్మన్ భరత్‌కుమార్, పూనూరు రవి, మలిశెట్టి, తటవర్తి వాసు, పద్మ, రూరల్ సిఐ రమణ, ఎస్ఐ రహీంరెడ్డి తదితరులు పాల్గొన్నారు.

# గిరిజనుల తాగునీటి వసతికి రూ.13 కోట్లు!

**• ఐటిడిఏ పిడి వెంకటేశ్వర్లు వెల్లడి**

జిల్లాలో గిరిజన గ్రామాల్లో 13 కోట్ల రూపాయలతో త్రాగునీటి సరఫరాను ఏర్పాటు చేస్తున్నట్లు సమీకృత గిరిజనాభివృద్ధి సంస్థ (ఐటిడిఏ) ప్రాజెక్ట్ అధికారి వెంకటేశ్వర్లు తెలిపారు. వెంకటగిరి మండలం ధర్మచాట్లవారి కండ్రిగలో వాటర్ ట్యాంక్ ప్రారంభోత్సవంలో ఆయన పాల్గొన్నారు. ఈ సందర్భంగా గిరిజనుల అభివృద్ధికి తీసుకొంటున్న చర్యలను వివరించారు. ముఖ్యంగా గిరిజన ప్రాంతాల్లో అభివృద్ధికి ప్రాధాన్యమిస్తున్నామన్నారు. భూమిలేని వారికి భూమిని ఇప్పించడంతోపాటు ప్రతి గిరిజన కుటుంబానికి 35 కేజీల బియ్యం ఇవ్వనున్నట్లు తెలిపారు. 1370 గిరిజన కాలనీల్లో అంగన్‌వాడీ భవన నిర్మాణాలు చేపడుతామన్నారు. సంక్షేమ ఫలాలు, సబ్సిడీ రుణాలను ప్రతి గిరిజనుడు సద్వినియోగం చేసుకోవాలని కోరారు. వరి సాగు చేసే గిరిజనులు ఇతర పంటలపై దృష్టి సారించాలని సూచించారు.

# ఇబ్బందుల్లో రొయ్యల పెంపకందార్లు!

**• వాతావరణంలో మార్పులే కారణం**

వర్షం పడక, వాతావరణంలో మార్పుల కారణంగా వెనామి సాగుపై తీవ్ర ప్రభావం పడుతోంది. లాభాలు వస్తాయని ఆశించి ఈ సాగు చేపట్టిన రైతులు అనుకొన్న విధంగా రొయ్యలు పెరగక, ఖర్చులు తడిసి మోపెడై తీవ్రంగా నష్టపోతున్నారు. ముత్తుకూరు మండలంలో ఈ వెనామి సాగు అధికంగా వుంది. ఉప్పునీటి క్రీక్‌లు, బోరు నీటి ఆధారంగా రైతులు లక్షల రూపాయలు పెట్టుబడులు పెట్టి రొయ్యల సాగు చేపట్టారు. ఈ ఏడాది వర్షాలు సక్రమంగా పడకపోవడంతో రొయ్యలకు వివిధ రకాల వ్యాధులు ప్రబలుతున్నాయి. ఇప్పటికే కరెంటు కోతల కారణంగా జనరేటర్ వినియోగానికి డీజిల్ ఖర్చులు తడిసి మోపెడవుతుంటే, రొయ్యలకు సోకుతున్న వ్యాధులకు మందుల వినియోగానికి అయ్యే ఖర్చు మరింత భారం అవుతోంది రొయ్యల పెంపకందారులకు.

## డాక్టర్ లక్ష్మీ నరసారెడ్డికి

# డిఆర్ విశిష్ట సేవా పురస్కారం!

**సన్మానానికి అర్హుడైన ప్రజా డాక్టర్**



డాక్టర్ లక్ష్మీనరసారెడ్డి సన్మాన దృశ్యం.

కావలిలో పేరొందిన వైద్యుడు, అందరికీ అందుబాటులో వుండే డాక్టర్‌గా పేరు గడించిన డాక్టర్ లక్ష్మీ నరసారెడ్డికి ఇటీవల ఘన సన్మానం జరిగింది. విద్యాదాత దొడ్ల రామచంద్రారెడ్డి(డిఆర్) కళా పరిషత్ పంచమ వార్షికోత్సవం సందర్భంగా రాష్ట్రస్థాయి నాటక పోటీలు జరిగాయి. డాక్టర్ లక్ష్మీనరసారెడ్డికి డిఆర్ విశిష్ట సేవా పురస్కారం ప్రదానం చేసి డాక్టర్ దంపతులను ఘనంగా సన్మానించారు. ఈ సన్మానాన్ని అందుకొన్న లక్ష్మీనరసారెడ్డి డిఆర్ లాంటి మహోన్నత వ్యక్తి పేరిట పురస్కారం లభించడం సంతోషంగా వుందన్నారు. పేద, బడుగు, బలహీనవర్గాల విద్యాభివృద్ధికి డిఆర్ చేసిన సేవలు ఎనలేనివని కొనియాడారు. సన్మానం చేసిన ప్రతి ఒక్కరికి పేరుపేరున కృత్ఞజతలు తెలిపారు.

# గౌడ విద్యార్థులకు సన్మానం

**కౌండిన్య హెల్త్ అండ్ ఎడ్యుకేషన్ ట్రస్ట్ సాయం**



జడవల్లి నారాయణను సన్మానిస్తున్న పెనుగొండయ్య గౌడ్.

జిల్లా గౌడ సంఘ సమావేశం నెల్లూరులోని ఎన్జీఓ హోంలో ఇటీవల జరిగింది. కౌండిన్య హెల్త్ అండ్ ఎడ్యుకేషనల్ ట్రస్టు ఆధ్వర్యంలో జరిగిన ఈ కార్యక్రమంలో గౌడ సంఘం గౌరవాధ్యక్షుడు, మాజీ కౌన్సిలర్ నరసింహులుగౌడ్, కావలి నియోజకవర్గ బిసి సంఘం అధ్యక్షుడు పంది పెనుగొండయ్య గౌడ్ తదితరులు పాల్గొని ప్రసంగించారు. గౌడ కులస్తులందరూ సంఘటితమై ఏకతాటిపై నడవాలన్నారు. ప్రతి ఒక్కరు తమ పిల్లలను బాగా చదివించాలని, ముఖ్యంగా గీత కార్మికులు తమ బిడ్డల చదువుపట్ల శ్రద్ధ పెట్టాలన్నారు. ట్రస్టు తరఫున పదవ తరగతి, ఇంటర్ పరీక్షల్లో ప్రతిభ చూపిన 135 మంది విద్యార్థులకు ఒక్కొక్కరికి 2వేల రూపాయల నగదు, నిఘంటువు, ప్రశంసా పత్రాలను, ముగ్గురు విద్యార్థులకు ల్యాప్‌టాప్‌లను అందజేశారు. ఈ కార్యక్రమంలో జెఎన్ఆర్ గ్రూప్ చైర్మన్ డాక్టర్ జడవల్లి నారాయణ గౌడ్ తదితరులు పాల్గొన్నారు.



విపిఆర్ కన్వెన్షన్ సెంటర్‌లో జరిగిన వెంకయ్య నాయుడు పౌర సన్మాన సభలో ఆయన్ను సన్మానిస్తున్న ఏపి ఎడిబుల్ ఆయిల్ డీలర్స్ వెల్ఫేర్ అసోసియేషన్ అధ్యక్షుడు సన్నపురెడ్డి పెంచలరెడ్డి.

● గూడూరులో...

# తత్కాల్ టిక్కెట్లు తీసుకోవడం గగనకుసుమం!

### ఒక్క టిక్కెట్ జారీ చేయను 20 నిముషాలు పడుతోంది

గూడూరు రైల్వే రిజర్వేషన్ కౌంటర్‌లోని సిబ్బంది తత్కాల్ టిక్కెట్ల కోసం వచ్చేవారికి నరకం చూపిస్తున్నారు. గంటల తరబడి టిక్కెట్ల కోసం వేచివున్న సిబ్బంది పనితీరు కారణంగా టిక్కెట్లు దొరకని పరిస్థితి ఎదురౌతోంది. దీంతో అత్యవసరమై ప్రయాణాలు చేసేవారు అధిక ధర అయినా తత్కాల్ టిక్కెట్లు తీసుకోవడానికి సిద్ధపడినా ఫలితం వుండడం లేదు. గూడూరు రైల్వే జంక్షన్ కావడంతో ఇక్కడ నుంచి అటు ఉత్తర భారతదేశానికి, ఇటు దక్షిణ ప్రాంతానికి, తిరుమల పుణ్య క్షేత్రానికి రాకపోకలు సాగించే ప్రయాణీకులు అధికం. ఈ ప్రాంతం నుంచి మైకా, నిమ్మకాయల



వ్యాపారస్తులు ఎక్కువగా ప్రయాణిస్తుంటారు. అలాంటి వారు తత్కాల్ టిక్కెట్లపై ఆధారపడుతుంటారు. అయితే తత్కాల్ టిక్కెట్లు ఇచ్చే సమయం ఉదయం 10 నుంచి 12 గంటల వరకు కేవలం రెండు గంటలపాటు మాత్రమే. ఈ స్వల్ప సమయంలో ఎక్కువ మందికి టిక్కెట్లు లభించేలా చేయాల్సిన సిబ్బందికి కంప్యూటర్ పరిజ్ఞానం లేకపోవడంతో ఒక్కొక్కరికి టిక్కెట్ ఇవ్వాలంటే 20 నిముషాల సమయం తీసుకొంటుండడంతో రాత్రి నుంచి పడిగాపులు కాచినా ప్రయాణీకులకు టిక్కెట్లు అందడం లేదు. ఫిట్‌నెస్ కోల్పోయిన గూడ్స్ ఇంజన్ డ్రైవర్లు, కంప్యూటర్‌పై పరిజ్ఞానంలేని వారిని రిజర్వేషన్ కౌంటర్‌లో నియమించడం వల్ల ఈ పరిస్థితి తలెత్తుతున్నదని, రైల్వే అధికారులు ఈ సమస్యను చక్కదిద్ది తత్కాల్ టిక్కెట్లు లభించేలా చూడాలని ప్రయాణీకులు కోరుకొంటున్నారు.

● త్రాగునీటి సమస్యను పరిష్కరించలేని...

# వెంకటగిరి సమ్మర్ స్టోరేజ్ ట్యాంక్!

### కట్టి ప్రయోజనమేమి?

వెంకటగిరి పట్టణ ప్రజల దాహార్తి తీర్చేందుకు 70 కోట్ల రూపాయలతో సమ్మర్ స్టోరేజ్ ట్యాంకు నిర్మించినా స్థానికులకు నీటి సమస్యలు తప్పడం లేదు. దీని నుంచి సరఫరా అయ్యే నీరు రంగు మారి వస్తుండడంతో ఆ నీటిని త్రాగలేక ఇబ్బందులు పడుతున్నారు ప్రజలు. ఈ విషయం తెలుసుకొన్న ఎమ్మెల్యే కురుగొండ్ల రామకృష్ణ గుండ్ల సముద్రం వద్ద నిర్మించిన సమ్మర్ స్టోరేజ్ ట్యాంకును ఇటీవల పరిశీలించారు. తెలుగుగంగ కాలువ నుంచి నీరు ఎలా వస్తుంది, వచ్చిన నీటిని ఎన్నిరకాలుగా శుద్ధి చేస్తారు, తదితర అంశాలను అధికారులను అడిగి క్షుణ్ణంగా పరిశీలించారు. నీటిని శుద్ధి చేయడం గురించి అధికారులు వివరించినప్పటికీ ఆయన సంతృప్తి చెందలేదు. ఇంత చేసినా ఎందుకు రంగునీళ్లు వస్తున్నాయని ప్రశ్నించారు. పాత పైపులు లీకేజీల కారణం వల్ల రంగు నీళ్ల వస్తున్నట్లు అధికారులు చెప్పగా, పాత పైపులు ఎక్కడెక్కడ వున్నది సర్వే చేసి చెబితే ప్రభుత్వానికి ప్రతిపాదనలు పంపి నిధులు తెప్పిస్తామన్నారు. నీటిని శుభ్రం చేసి ప్రజలకు సురక్షిత నీరు అందజేయాలని ఆదేశించారు. కాంగ్రెస్ పాలనలో పనులు చేపట్టిన కాంట్రాక్టర్ పూర్తి స్థాయిలో పనులు చేయనందున పెండింగ్ బిల్లులు నిలిపి వేయాలని అధికారులను కోరారు. ఈ కార్యక్రమంలో మున్సిపల్ ఛైర్మన్ దొంతు శారద, వైస్ ఛైర్మన్ బీరం రాజేశ్వరరావు, మున్సిపల్ కమిషనర్ భాస్కర్‌రావు, డిఇ బాషా తదితరులు పాల్గొన్నారు.

● బోగోలు మండలాధ్యక్షురాలిగా

# పర్రి సులోచనమ్మ

బోగోలు మండలాధ్యక్షురాలిగా పర్రి సులోచనమ్మ ఇటీవల బాధ్యతలు చేపట్టారు. మండల పీఠంపై కూర్చొన్న అనంతరం ఆమె మాట్లాడుతూ మండలాన్ని అన్ని రకాలుగా అభివృద్ధిపరచేందుకు నా వంతు కృషి చేస్తానని తెలిపారు. తనపై నమ్మకం వుంచి మండల బాధ్యతలు అప్పజెప్పిన పెద్దల ఆశయాలకు అనుగుణంగా, వారి నమ్మకాన్ని వమ్ము చేయకుండా చిత్తశుద్ధితో ప్రజా సమస్యల పరిష్కారానికి కృషి చేస్తానని హామీ ఇచ్చారు. తన భర్త అయిన పర్రి అంకులయ్య గతంలో బోగోలు సర్పంచ్‌గా పనిచేసి ప్రజలు, అధికారుల మన్ననలు అందుకొన్నారన్నారు. అందరి సహకారంతో మండలాధ్యక్షురాలిగా విజయవంతంగా బాధ్యతలు నెరవేరుస్తానన్నారు. ఈ బాధ్యతల స్వీకరణ కార్యక్రమంలో స్థానిక నేతలు తూపిలి పెంచలయ్య, పర్రి అంకులయ్య, నాయబ్ రసూల్, రఘు, లక్ష్మారెడ్డి, పుల్లయ్య తదితరులు పాల్గొన్నారు.

● నాయుడుపేటలో

# దొంగలు బాబోయ్ దొంగలు!

### కంటిపై కునుకులేని జనం

సూళ్లూరుపేట, నాయుడుపేట ప్రాంతాల్లో దొంగతనాలు అధికమయ్యాయి. ఇంట్లో చొరబడి దొంగతనం చేసే ముఠాలు, అమాయకుల్లా నటిస్తూ మాయ మాటలతో బురిడీ కొట్టించి నగలు, నట్రా దోచుకెళ్లేవాళ్లు ఎక్కువవ్వడంతో ప్రజలు హడలి పోతున్నారు. నాయుడుపేటలో రోజూ ఏదో ఒక ప్రాంతంలో దొంగతనం జరుగుతుండడం, చిన్న చిన్న వస్తువుల దగ్గర్నుంచి నగలు, నగదు ఏమీ వదలి పెట్టకుండా దోచేస్తుండడంతో పట్టణ ప్రజలకు దొంగల భయంతో కంటిమీద కునుకు లేకుండాపోయింది. స్థానిక గిరిడీవీధిలో ఇంట్లో చొరబడి దొంగతనం చేసిన దొంగలు చివరకు నిద్రిస్తున్న చిన్నారి వెండి పట్టీలను తస్కరించుకువెళ్లారు. ఇటీవల ఇరువురు మహిళలు, ఒక వ్యక్తితో కలసి బజారులో వెళ్తున్న మహిళ వద్దకు వచ్చి చైతన్య ఆస్పత్రి చిరునామా చెప్పమని అడిగి, ఆస్పత్రిని చూపించాలని కోరి మనుషులెవరూ లేనిచోట ఆ మహిళ నుంచి నగదు, కమ్మలు దోచుకొనిపోయారు. గత మూడు నాలుగు నెలలుగా దొంగతనాలు అధికమవుతున్నా పోలీసులు సరిగా పట్టించుకోకపోవడం లేదన్న విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. మరోవైపు సూళ్లూరుపేటలోనూ దొంగతనాలు జాస్తిగా వున్నాయి. విఆర్‌ఓనని చెప్పి దేగవారికండ్రిగకు ఒక వ్యక్తి వచ్చి పింఛను మంజూరు చేస్తానని వచ్చి ఆదమరచి వుండగా ఇంట్లోని బంగారు దొంగిలించుక వెళ్లడం సంచలనం కల్గించింది. ఇప్పటికైనా పోలీసులు ఈ రెండు ప్రాంతాలపై నిఘా వుంచి దొంగతనాలను అరికట్టాలని ప్రజలు కోరుతున్నారు.

# మూడు నెలలుగా సరఫరా కాని పామాయిల్!

జిల్లాలో చౌక దుకాణాల ద్వారా అందాల్సిన పామాయిల్ మూడు మాసాలుగా నిలిచిపోవడంతో వినియోగదారులు పామాయిల్ కోసం ఎదురు చూడాల్సిన పరిస్థితులు నెలకొన్నాయి. జిల్లావ్యాప్తంగా గల 1896 రేషన్ షాపుల ద్వారా 8 లక్షలా 95వేల 208 మంది తెల్లరేషన్ కార్డుదారులకు కార్డుకు ఒక కేజీ వంతున 8.95 లక్షల మందికి పామాయిల్ ప్యాకెట్లు అందించాలి. ఈ సరఫరా ఏప్రిల్, మే, జూన్ మాసాల నుంచి నిలిచిపోయింది. రేషన్ షాపుల ద్వారా 40 రూపాయలకు అందుతున్న పామాయిల్ బయట మార్కెట్లో 80 రూపాయలు పెట్టి కొనుగోలు చేయలేక అల్లాడి పోతున్నారు. ఈ నేపథ్యంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు చెరికొంత భరిస్తాయి. అయితే గత ఏడాది నుంచి కేంద్రం ఇస్తున్న సబ్సిడీ నిలిచిపోవడంతో ఆ మొత్తం భారం రాష్ట్ర ప్రభుత్వంపై పడింది. దీంతో అంత భారం మోయలేక సరఫరా నిలిపివేసినట్లు సమాచారం. వినియోగదారులు డీలర్లను దీనిపై ప్రశ్నిస్తుండడంతో వారు సమాధానం చెప్పలేక, తాము డిడిలు కట్టినా బియ్యంతో సరిపెట్టేస్తున్నారు తప్ప పామాయిల్ సరఫరా చేయడం లేదని వాపోతున్నారు.

● రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి

# అనుభవ రాహిత్యం!

### కావలిలో వైకాపాకు ఎదురు దెబ్బలు



కావలి నియోజకవర్గం నుంచి శాసనసభ్యునిగా వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ అభ్యర్థి రామిరెడ్డి ప్రతాప్ కుమార్‌రెడ్డి ఎన్నికైనప్పటికీ ఆ సంతోషం, ఉత్సాహం ఆ పార్టీ కార్యకర్తలలో లేకుండా పోయింది. శాసనసభ ఎన్నికలలో గట్టెక్కినప్పటికీ ఆ తర్వాత ఒకదాని వెంట మరొకటి ఎదురు దెబ్బలు తగలడంతో ఆ పార్టీలో అయోమయం నెలకొనింది. ఇటీవల జరిగిన కావలి మున్సిపల్ ఛైర్మన్ ఎన్నికలో చేతులారా ఓటమి కొని తెచ్చుకొన్నట్లయ్యింది. తగిన సంఖ్యాబలం వున్నప్పటికీ ఇచ్చిన మాటను తప్పడం, కొత్తవారిని ఛైర్మన్ అభ్యర్థిగా తెరమీదకు తేవడం లాంటి చర్యలతో శాసనసభ్యుడు రామిరెడ్డి ప్రతాప్‌కుమార్‌రెడ్డి అభాసుపాలయ్యాడు. రాజకీయాలు తెలియకపోవడం, ఇతరులపై ఆధారపడాల్సి రావడంతో మున్సిపల్ ఛైర్మన్ పదవి కోల్పోవాల్సి వచ్చింది. మూలిగే నక్కపై తాటికాయ పడిన చందంగా అసలే మున్సిపల్ పీఠాన్ని కోల్పోయిన ప్రతాప్‌కుమార్‌రెడ్డికి ఆ పార్టీ జడ్పీటిసి సభ్యురాలు టిడిపికి జై కొట్టడంతో మరో ఎదురు దెబ్బ తగిలింది. మరోవైపు నకిలీ మద్యం నియోజకవర్గంలో భారీగా దొరుకుతుండడం, కేసు ఉచ్చు బిగిస్తుండడంతో పాపం రామిరెడ్డి ప్రతాప్‌కుమార్ రెడ్డి దిక్కుతోచని స్థితిలో పడిపోయాడు. దీంతో ఆ పార్టీ కార్యకర్తలలో కూడా అయోమయం నెలకొనింది.

● పొదలకూరు చక్కెర ఫ్యాక్టరీ

# రైతులకు బాకీ రూ.13 కోట్లు!

పొదలకూరు చక్కెర కర్మాగారానికి సంబంధించి 13 కోట్ల రూపాయలు బకాయిలు రెండేళ్లుగా నిలచిపోవడంతో రైతులు తీవ్ర ఇబ్బందులు పడుతున్నారు. 2012–13 సంవత్సరానికిగాను పదివేల ఎకరాల్లో చెరకు సాగుచేసిన రైతులు 2.70 లక్షల టన్నుల చెరకును ఈ ఫ్యాక్టరీలో క్రషింగ్ చేశారు. దీనికి సంబంధించి రైతులకు చెల్లించాల్సిన 12.80 కోట్ల రూపాయలు నిలిపి వేశారు. దీనిపై పలుమార్లు ఫ్యాక్టరీ యాజమాన్యాన్ని ప్రశ్నించినా సరైన సమాధానం రాకపోవడంతో ఆగ్రహించిన రైతులు ఫ్యాక్టరీకి తాళాలు వేశారు. 2013–14 సంవత్సరానికి సంబంధించి నాలుగువేల ఎకరాల్లో షుమారు 1.20 లక్షల టన్నుల చెరకు సాగులో వుంది. మరో మూడు నెలల్లో సీజన్ ప్రారంభం కానున్న పరిస్థితుల్లో చెరకు ఫ్యాక్టరీ యాజమాన్యం మౌనంగా వుండడంతో రైతులు తీవ్ర ఆగ్రహం వ్యక్తం చేస్తున్నారు. తమ బకాయిలు తక్షణం చెల్లించాలని అవసరమయితే ఫ్యాక్టరీని వేలం పెట్టయినా బకాయిలు తీర్చాలని చెరకు రైతులు డిమాండ్ చేస్తున్నారు.

## లబోదిబో మంటున్న రైతులు

# ఇందుకూరుపేటను అభివృద్ధి చేస్తా!

## మండలాధ్యక్షురాలు కైలాసం రేణుక

ఇందుకూరుపేట మండలంలో అన్ని గ్రామాల అభివృద్ధే ధేయ్యంగా పని చేస్తానని మండలాధ్యక్షురాలిగా బాధ్యతలు చేపట్టిన కైలాసం రేణుక తెలిపారు. పదవి చేపట్టిన అనంతరం ఆమె విలేకరులతో మాట్లాడారు. ఎంపిటిసిగా, ఎంపిపిగా ఎన్నికయ్యేందుకు సహకరించిన ప్రజలకు, నేతలకు ప్రతి ఒక్కరికి ఆమె కృతజ్ఞతలు తెలిపారు. రాజకీయాలకు అతీతంగా ప్రతి ఒక్కరిని కలుపుకొనిపోయి ప్రజలకు మంచి పాలన అందిస్తామన్నారు. ప్రజలకు ఎలాంటి సమస్య వచ్చినా నేరుగా కలవొచ్చని, వారి సమస్యలకు సత్వర పరిష్కారం లభించేలా శాయశక్తులా పని చేస్తానని మండల ఉపాధ్యక్షుడిగా ఎన్నికైన సుధాకర్ తెలిపారు. ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించిన మండల అభివృద్ధి అధికారిణి జ్యోతి మాట్లాడుతూ మండలంలో ఆధార్ అనుసంధాన ప్రక్రియలను నెలాఖరులోగా పూర్తి చేస్తామన్నారు. ఈ కార్యక్రమంలో వైఎస్ఆర్‌సిపి నేత కైలాసం ఆదిశేషారెడ్డి, వైసిపి మండల కన్వీనర్ శ్రీనివాసులురెడ్డి, స్టీరింగ్ కమిటీ సభ్యుడు గొల్లపల్లి విజయకుమార్, తహశీల్దార్ వెంకటేశ్వర్లు, డాక్టర్ మున్వర్ సుల్తానా, అన్నపూర్ణ తదితరులు పాల్గొన్నారు.

● ఉదయగిరిలో...

# తెల్లరాయి అక్రమ త్రవ్వకాలు!

## చోద్యం చూస్తున్న మైనింగ్ అధికారులు

ఉదయగిరి ప్రాంతంలో తెల్లరాయి అక్రమ రవాణా యదేచ్ఛగా జరుగుతోంది. నియోజకవర్గ పరిధిలోని దుత్తలూరు తదితర ప్రాంతాల నుంచి తెల్లరాయిని ఇష్టానుసారం త్రవ్వి తరలిస్తున్నా పట్టించుకొనే వారే లేకుండా పోయారు. ఈ ప్రాంతంలో దాదాపు 600 ఎకరాల్లో తెల్లరాయి నిక్షేపాలు వున్నాయి. ప్రభుత్వ భూముల్లో తెల్లరాయి త్రవ్వకాలు జరపరాదని నిబంధనలు వున్నప్పటికీ ధనదాహంతో కొందరు కూలీలను ఏర్పాటు చేసుకొని లారీలల్లో నింపి తరలిస్తున్నా పట్టించుకొనే అధికారులే లేకుండా పోయారు. గత ఐదేళ్లుగా ఈ అక్రమ త్రవ్వకాలు జరుగుతున్నాయని, దీనిపై రెవిన్యూ అధికారులకు ఎన్నోసార్లు సమాచారం అందించినా ఆవైపే కన్నెత్తి చూడలేదని స్థానికులు వాపోతున్నారు. చిన్న చిన్న వాటికే హంగామా చేసే మైనింగ్ అధికారులు ఇంత జరుగుతున్నా పట్టించుకోక పోవడం వెనుక ఆంతర్యం ఏమిటని ఈ ప్రాంత ప్రజలు అనుమానం వ్యక్తం చేస్తున్నారు.

**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190
జీవిత చందా రూ.2000లు
సంవత్సర చందా
స్వదేశంలో రూ.250లు
విదేశాలకు రూ.1000లు

# కావలి మునిసిపల్ వైస్‌ఛైర్మన్‌కు సన్మానం!

బిజెపిని కావలిలో బలోపేతం చేయడంలోనూ, పార్టీని, పార్టీ సిద్ధాంతాలను ప్రజల్లోకి తీసుకెళ్లడంలో భరత్‌కుమార్ ఎంతో కృషి చేశారని వక్తలు కొనియాడారు. బిజెపి జిల్లా ఉపాధ్యక్షుడిగా వున్న భరత్‌కుమార్ రెండుసార్లు కౌన్సిలర్‌గా పనిచేయడంతోపాటు మున్సిపల్ వైస్ ఛైర్మన్‌గా ఎన్నికైన సందర్భాన్ని పురస్కరించుకొని ఇటీవల కావలి పట్టణంలో అభినందన సభ జరిగింది. పట్టణ బిజెపి అధ్యక్షుడు రంగారెడ్డి ఆధ్వర్యంలో స్థానిక మన్నెం గోపాలకృష్ణారెడ్డి కళ్యాణ మండపంలో జరిగింది ఈ కార్యక్రమం. పార్టీ సీనియర్ నేతలు సన్నపురెడ్డి సురేష్‌రెడ్డి, కర్నాటి ఆంజనేయరెడ్డి, మిడతల రమేష్ తదితరులు ఈ సందర్భంగా మాట్లాడారు. విద్యార్థి నాయకుడిగా, బిజెపి కార్యకర్తగా పనిచేసి పార్టీలో వివిధ బాధ్యతలు నిర్వర్తించిన భరత్‌కుమార్ నిబద్ధత, అంకిత భావం పలువురికి ఆదర్శమన్నారు. పార్టీ కోసం పనిచేస్తే పదవులు వాటంతట అవే వెతుక్కొంటూ వస్తాయనేందుకు భరత్‌కుమార్ ఉదాహరణ అన్నారు. గజమాల తోను, శాలువాతోను ఘనంగా ఆయన్ను సన్మానించారు. సన్మానగ్రహీత భరత్‌కుమార్ మాట్లాడుతూ తనకు జరిగిన సన్మానానికి కృతజ్ఞతలు తెలిపారు. కావలి పట్టణంలో ప్రధాన సమస్యలైన పారిశుధ్యం, డ్రైనేజి వ్యవస్థ మెరుగుదలకు కృషి చేస్తానని, ప్రజలకు చక్కని పాలన అందిస్తామన్నారు. పేదలకు పింఛన్లు, రేషన్ కార్డులు, ఇళ్ల స్థలాలు అందేలా చేస్తామన్నారు. పార్టీ ఇచ్చిన అవకాశం, బీద సోదరుల సహాయ సహకారాలతో మున్సిపల్ వైస్ ఛైర్మన్ పదవి లభించడం సంతోషంగా వుందన్నారు.

## బిజెపిని బలోపేతం చేశాడు

# పరమపదానికి పవిత్ర మాసం రంజాన్!



రామనారాయణ

ప్రపంచ వ్యాప్తంగా ముస్లిం మతస్తులు ఆచరించే ఉపవాస దీక్షా వ్రతం రంజాన్ లేదా రమదాన్. ఇస్లామియా క్యాలెండర్‌ను అనుసరించి వచ్చే నెలలో ఒక నెల పేరు ఇది. ఆ నెలల క్రమంలో తొమ్మిదవ మాసం రంజాన్ మాసం. ఈ నెల ఆరంభమైనప్పటి నుంచి ముస్లింలు అందరూ ఉపవాస దీక్ష పాటిస్తారు. ఖురాన్‌ను అనుసరించి రంజాన్ నెలలో విధిగా ఆచరించాల్సిన నియమం ఉపవాసం. దీనినే పార్శీ భాషలో 'రోజా' అని, అరబ్బీలో 'సామ్' అని పిలుస్తారు. ఇస్లాంలో రోజాకు ఎంతో ప్రాధాన్యత వుంది. యుక్తవయస్సు వచ్చిన తర్వాత రంజాన్ మాసంలో ఉపవాసం వుండడం అందరికీ ఫర్జ్ (తప్పనిసరి) అవుతుంది. మనం చేసే సత్కార్యాలకు అల్లా వివిధ మార్గాలలో ప్రతిఫలం అందజేస్తాడు. అయితే రంజాన్ నెలలో కఠినమైన ఉపవాస దీక్షలు పాటించేవారికి అల్లా సాక్షిగా వుండడమే కాకుండా, ప్రతి ఫలాన్ని ఆ అల్లా నుంచి నేరుగా అందుతుందన్నదని ముస్లింల విశ్వాసం.

## పవిత్రతే పరమపద సోపానం

రంజాన్ నెలలో చేసే ఉపవాస దీక్ష (రోజా)లు ఒక క్రమపద్ధతిలో నియమనిష్టలతో జరుగుతాయి. తెల్లవారు జామునే నిద్రలేవడం, సూర్యోదయానికి ముందే సహర్ చేయడం, రోజా ఐదు పూటలా నమాజు చేయడం, సూర్యాస్తమ సమయంలో ఇఫ్తార్ తదితర కార్యక్రమాలలో పాల్గొనడం ఈ రంజాన్ మాసంలో ముస్లింల దైనందిన జీవితంలో ఒక భాగంగా మారుతుంది. సహర్ అనగా సూర్యోదయానికి ముందు తీసుకొనే ఆహారం, సూర్యాస్తమయం తర్వాత తీసుకొనే ఆహారాన్ని ఇఫ్తార్ అంటారు. దాదాపు 13 గంటల పాటు వుండే ఉపవాస దీక్షలో పాటించాల్సిన నియమనిష్టలను గురించి పవిత్ర గ్రంథం ఖురాన్‌లో వివరించబడింది. రోజా వుండే వాళ్లు పాటించాల్సిన ముఖ్యవిధుల్లో ప్రధానమైనది అబద్ధమాడకపోవడం. ఉపవాస దీక్షలు చేసేవారు సత్యమే పలకాలి, అబద్ధం ఆడరాదు. పరనిందకు పాల్పడకుండా వుండడం, శారీరక మానసిక వాంఛలకు దూరంగా, నిగ్రహం పాటిస్తూ దైవ చింతనలో గడపడమే ఈ ఉపవాస దీక్షల పరమార్థం. మనిషిలో దైవ భక్తిని, దైవ భీతిని, సుగుణాలను పెంపొందించడమే లక్ష్యం. ఖురాన్‌లో వీటిని 'తఖ్వి' అంటారు. మానవాళి చేసిన తప్పులకు ప్రాయశ్చిత్తం ఈ ఉపవాస దీక్షల వల్ల లభిస్తుంది. ఆకలి కోసం అలమటించే అన్నార్తుల బాధలను స్వయంగా అనుభవించడమే ఈ ఉపవాసాల ఉద్దేశం. దీనివల్ల ఉపవాస దీక్షాపరులకు సాటివారి పట్ల సానుభూతి, దైవచింతన కల్గుతుందని భావన.

## దివ్య ఖురాన్ ఆవిర్భవించిన మాసం

ముస్లింల పరమ పవిత్ర గ్రంథమైన ఖురాన్ ఈ రంజాన్ నెలలోనే ఆవిర్భవించింది. ముస్లింలు చాంద్ర మానాన్నే అనుసరిస్తారు. పండుగలు ఏ మతస్తులకు సంబంధించినవి అయినప్పటికీ అందులో సందేశం దాగి వుంటుంది. ఈ రంజాన్ పండుగ సైతం మానవాళికి హితాన్ని బోధిస్తుంది. క్రమశిక్షణ, దాతృత్వం, ధార్మిక చింతనల కలయికే రంజాన్. ఉపవాస దీక్షలు పాటించే ముస్లింలు రాత్రింబవళ్లు నమాజులో లీనమై వుంటారు. సాధారణంగా రోజుకు ఐదుసార్లు నమాజు చేయడం అందరికి తెలిసిందే. వాటికి తోడు రంజాన్ నెలలో ప్రత్యేక ప్రార్థనలు జరుపుతారు. ఈ నెలలో రాత్రి వేళ (ఇషా) ఫర్జ్ నమాజ్ తర్వాత అదనంగా ఇరవై రకాతుల 'తరావీహ్' నమాజు చేస్తారు. రంజాన్ మాసంలో 21వ రోజు నుంచి చివరి రోజు వరకు ఒక ప్రత్యేకత వుంది. వీటినే తఖ్తేకేరాత్ (మహిమగల రాత్రు) లంటారు. ఈ రోజుల్లో 'ఏతి కాఫ్' పాటిస్తారు. అనగా తపోనిష్ట అని అర్థం. దీనిని పాటించేవారు మసీదులోనే ఒక ప్రక్క డేరా కట్టుకొని అక్కడే దైవధ్యానం, ప్రార్థనలు, ఖురాన్ పారాయణం చేస్తూ దైవచింతనలో గడుపుతారు. బలమైన కారణం వుంటే తప్ప ఏతికాఫ్ చేసేవాళ్లు మసీదును వదలి బయటకు పోకూడదనే నిబంధన వుంది. ఇక దివ్య ఖురాన్ అవతరించిన రోజుగా భావించే ముస్లింలు రంజాన్ నెలలో 27వ రోజున షబ్–ఏ–ఖద్ర్ జరుపుకొంటారు. ఆ రాత్రి జాగరణ చేసి ప్రార్థనలో గడుపుతారు. కఠోర దీక్షతో ప్రార్థనలు చేసేవారికి 83 సంవత్సరాలపాటు ప్రార్థనలు చేసిన ఫలం దక్కుతుందని సర్వపాపాలు తొలగుతాయని భావిస్తారు.

## విధిగా దాన ధర్మాలు

రంజాన్ ఉపవాస దీక్షలలో అత్యంత ముఖ్యమైనది దానధర్మాలు చేయడం. దీనిని జకాత్ అంటారు. ధనికులు తన సంవత్సరాంతంలో మిగిలిన సంపద నుండి రెండున్నర శాతం పేదలకు దానంగా ఇవ్వాలి. ప్రతి ముస్లిం ఈ విధిని తప్పక ఆచరించాలని ఖురాన్ బోధిస్తుంది. జకాత్ తోపాటు ఫిత్రా దానానికి ఎంతో ప్రాధాన్యత వుంది. రెండు కిలోల గోధుమలు, కొన్ని ఇతర ఆహార ధాన్యాలను పంచిపెట్టాలి. ఈ దానం వలన సర్వపాపాలు తొలగుతాయని, ఉపవాస దీక్షలో కలిగే పొరపాట్లు, క్షమించబడతాయని మహమ్మద్ ప్రవక్త అనుచరుడు అబ్దుల్లా బిన్ మసూద్ తెలిపారు.

## నెలవంక తెచ్చే పండగ

పవిత్ర కార్యాలతో రంజాన్ నెల ముగియగానే షవ్వాల్ నెల వంక ప్రత్యక్షమవుతుంది. గగనాన్ని చుంబిస్తున్నట్లు ముచ్చటగా ముస్తాబైనట్లు నెలవంక దర్శనమివ్వగానే ముస్లింలు ఉపవాస దీక్ష ముగించి మరుసటి రోజున రంజాన్ పండుగ ఘనంగా భక్తిశ్రద్ధలతో జరుపుకొంటారు. వివేకపు ద్వారాలు తెరచి సౌహార్ద్ర సమభావనలు పంచాలన్నది దైవ ఆదేశం. ఇందుకు సామూహిక శక్తి అవసరం. ఈ శక్తిని కల్గించేదే నమాజ్. సత్ప్రవర్తన గల మనిషి సర్వేశ్వరుని దృష్టిలో అందరికన్నా మిన్న. ఈద్‌ను శ్రామికుని వేతనం లభించే రోజని ఖురాన్ విస్పష్టంగా పేర్కొంది.



# వెంకయ్య నాయుడికి అపూర్వ స్వాగత సత్కారాలు!

## మనసుకు నచ్చిన మనిషిగా ఆదరించారు.



వెంకయ్య నాయుడికి సన్మానం చేసి రంగడి గోపురం నమూనాను అందజేస్తున్న ఆదాల ప్రభాకర్‌రెడ్డి, నెల్లూరు దోలేంద్ర ప్రసాద్.

కేంద్రమంత్రి హోదాలో వెంకయ్య నాయుడు గారి నెల్లూరు జిల్లా మొదటి పర్యటన ఆద్యంతం ఆత్మీయంగా, హార్దికంగా, అభిమాన పురస్కారంగా జరిగింది. దూరాభారం వెళ్లి, చాలా ఏళ్ల తర్వాత ఇంటికి తిరిగి వచ్చిన పెద్ద కుమారుడిని కుటుంబ సభ్యులు ప్రేమగా, ఆరాధనా భావంతో స్వాగతించినట్లుంది ఆ పర్యటన చూస్తుంటే. ఆయన నెల్లూరులో కాలు పెట్టినప్పటి నుంచి, తిరిగి సరిహద్దులు దాటే వరకు తమ అభిమానంతో తల మునకలు చేశారు నెల్లూరీయులు.

వెంకయ్య నాయుడు బిజెపి నేత. జీవితకాలం ఆ పార్టీని మాత్రమే అంటి పెట్టుకొని వుండిన రాజకీయవాది. కానీ ఆయన్ను నెల్లూరీయులు బిజెపి నేతగా భావించలేదు. ఒక పార్టీకి పరిమితమైన రాజకీయవాదిగా చూడలేదు. పార్టీలకు అతీతంగా, అన్నిరకాల వర్గ భావనలతో సంబంధం లేకుండా మనసుకు నచ్చిన మనిషిగా స్వాగతించారు, ఆదరించారు.

తొలి రోజు 18తేది మొత్తం బిజెపికి కేటాయింపు. నగరంలో భారీ ప్రదర్శనతో ఆయన్ను కార్యకర్తల సభకు తోడ్కొని వచ్చారు. జనసందోహంతో జరిగిన సభలో పూలమాలలు, శాలువాలతో ముంచెత్తారు. జిల్లాలో ఏ బిజెపి నేతకు కూడా పార్టీ పక్షంగా ఇంత ఘన సన్మానం జరగలేదని చెప్పవచ్చు.

రెండవ రోజు – 19తేది వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి కన్వెన్షన్ సెంటర్‌లో ఆత్మీయ పౌర సత్కారం. నెల్లూరు పౌరులు అంత విశాల హృదయులా అని ఆశ్చర్యపడే రీతిలో నడిచిందా సభ. బిజెపి, తెలుగుదేశం, కాంగ్రెస్, సిపిఎం, సిపిఐ పార్టీల నేతలందరూ హాజరైనారు. వెంకయ్య

కొరవ 14వ పేజీలో



వెంకయ్య నాయుడిని సత్కరిస్తున్న కృష్ణపట్నం పోర్టు సిఇఓ సి.శశిధర్.



వెంకయ్య నాయుడిని వేద పండితులతో కలసి సత్కరిస్తున్న హైదరాబాద్ సువర్ణ భూమి దెవలపర్స్ ఎండి బొల్లినేని శ్రీధర్.

# జెప వైఫల్యం ఒక చేదు అనుభవం!

ఎట్టకేలకు, చిట్టచివరకు నెల్లూరు జిల్లా పరిషత్ ఛైర్మన్ ఎన్నిక ముగిసింది. వైకాపా అభ్యర్థి బొమ్మిరెడ్డి రాఘవేంద్రరెడ్డి ఛైర్మన్‌గా ఎన్నికైనాడు. జిల్లా పరిషత్ స్థాయికి, గౌరవానికి, హుందాతనానికి అన్ని విధాల తగినవాడు రాఘవ. ఇంజనీరింగ్ పట్టభద్రుడు. స్వయంకృషితో ఆర్థికంగా ఉన్నతికి ఎదిగినవాడు. రూపాయికి, అర్ధకు చెయ్యి చాపవలసిన అగత్యం లేదు. రాజకీయ అనుభవం కూడా వుంది. ఆయన తండ్రి బి.సుందరరామిరెడ్డి ఆత్మకూరు నుంచి నాలుగుసార్లు ఎమ్మెల్యేగా గెలిచాడు. అంత సుదీర్ఘ కాలం ఎమ్మెల్యేగా పదవి అనుభవించినా ప్రజలకు సన్నిహితం కావడం తప్ప, అవినీతికో, అధికార దుర్వినియోగానికో పాల్పడని సద్గుణ శీలి. ప్రజా జీవితంలో ఆదర్శప్రాయుడు. ఆ కుటుంబ నేపథ్యం రాఘవను కూడా సజ్జనుడిగా మలచింది. రాజకీయ పదవులూ ఆయనకు కొత్త కాదు. స్థానిక సంస్థల నుంచి శాసన మండలి సభ్యుడిగా ఎన్నికై మంచి పేరు తెచ్చుకొన్నాడు. రాఘవ నేతృత్వంలో జిల్లా పరిషత్ మంచి పాలన అందిస్తుందనే ఆశించాలి. ఆయనకు మా అభినందనలు.

జిల్లా పరిషత్‌లో జడ్పీటిసి సభ్యులు ఓటర్లు. జిల్లాలో మొత్తం 46 మంది జడ్పీటిసి సభ్యులు, అందులో 31 స్థానాలను వైకాపా గెల్చుకొన్నది. తెలుగుదేశానికి దక్కింది 15 మాత్రమే. అయితే ఛైర్మన్ ఎన్నిక జరిగే లోగా రాష్ట్రంలో తెలుగుదేశం పార్టీ అధికారంలోకి రావడంతో ఆ పదవి మీద కన్నేశారు తెలుగు నేతలు. సాధారణంగా స్థానిక సంస్థల ప్రతినిధులు అధికారం ఎట్లా వుంటే అటే వెళ్తారు. దానికి తగినట్లే పది పన్నెండు మంది తెలుగుదేశం వైపు గోడ దూకడానికి సిద్ధపడ్డారు కూడా. కానీ ఈ బాధ్యత ఎవరు స్వీకరించాలన్న ప్రశ్న వచ్చింది. తెలుగు నేతలు ఎవరికి వారు తమ కెందుకొచ్చిన గొడవ అన్నట్లు పక్క పక్కన తిరగడం మొదలు పెట్టారు. దానితో జిల్లా మంత్రి నారాయణ బరువంతా తన భుజాన వేసుకొన్నాడు. ఆయనకు ఈ తరహా రాజకీయం బొత్తిగా తెలియదు. చాలా తప్పటడుగులు పడ్డాయి. పోలీసు బలంతో, బంధువుల మీద అధికారపరమైన ఒత్తిడితో ప్రయత్నం జరిగింది. అన్ని ప్రయత్నాలూ విఫలమైనాయి. గెలుపుకు 9 మంది కావల్సి వుంటే, 8 మంది మాత్రమే వచ్చారు. బొమ్మా బొరుసుగా మారింది ఎన్నిక. లాటరీలో అదృష్టం వైకాపాను వరించింది. తెలుగుదేశం అభ్యర్థి వేనాటి రామచంద్రారెడ్డికి అన్ని అవకాశాలూ వున్నా, అదృష్టమనే ఆవగింజ దొరకలేదు. ఫలితం తెలిసిందే. మంత్రి నారాయణకు ఇదొక చేదు అనుభవం. ఆయన ఎవరితో మాట్లాడుతున్నదీ, ఏమి చేస్తున్నదీ తమతో చెప్పలేదని, తమతో మాట మాత్రం సంప్రదింపు చేయలేదని అందువల్ల తాము సహకరించలేక పోయామని చెప్తున్నారు తతిమా నేతలు. వారు పట్టీ పట్టనట్లు వుంటే నేను పట్టుకొని వూగులాడాలా, నా ప్రయత్నం నేను చేయవద్దా అని వాదిస్తున్నాడు నారాయణ. జిల్లా రాజకీయాలలో నారాయణ పెత్తనాన్ని పూర్తి స్థాయిలో ధృవపరచింది జెప రాజకీయం. ఎంతమంది నేతలున్నా చివరి మాట మంత్రి గారిదే అని నిరూపణ అయ్యింది. ఈ వాస్తవాన్ని ఎవరెట్లా జీర్ణం చేసుకొంటారో వేచి చూడాలి.



**మేషం**
అశ్విని, భరణి, కృత్తిక 1 పా

శక్తియుక్తులతో, హుందాతనంతో వ్యవహరించడం వల్ల పనులు త్వరితంగా సాగును. ఋణదాతల వత్తిడి తగ్గును. ఆధిపత్యపోరుకు స్వస్తి చెబుతారు. పుణ్యకార్యాచరణపై శ్రద్ధ చూపిస్తారు. శరీరంపై గాయాలు కాగల సూచన. స్పెక్యులేషన్ యోగించదు. సోదర అంశాలలో కఠినంగా వ్యవహరిస్తారు. గృహనిర్మాణ విషయాలలో స్తబ్దత. ఆర్థికలావాదేవీలలో మతిమరుపు లేకుండా జాగ్రత్త తీసుకోవాలి. 27వతేదీన ఇతరుల విషయాలలో జోక్యం వద్దు. సంయమనం, సమయస్ఫూర్తితో వ్యవహరించాలి. శనివారం సాయంత్రం ఉద్యోగ వ్యాపారాలలో నూతన నిర్ణయాలు, చర్చలు చేయవద్దు. శుక్రవారం పగటి నిద్ర వద్దు. అశ్విని జాతకులు జూలై 26 సూర్యోదయం నుంచి మధ్యాహ్నం 3.10 వరకు, భరణి వారు 26 మధ్యాహ్నం 3.10 నుంచి 27 సాయంత్రం 6.04 వరకు, కృత్తిక జాతకులు 27 సాయంత్రం 6.04 నుంచి 28 రాత్రి 9.05 వరకు అన్నీ అంశాలలో జాగ్రత్తలు తీసుకోవలెనని గమనించాలి.



**వృషభం**
కృత్తిక 2,3,4 పా. రోహిణి, మృగశిర 1,2 పా

శుభకార్య అంశాలపై దృష్టి ఉంచుతారు. ఆరోగ్య విషయంలో అశ్రద్ధచే ధనవ్యయం. వ్యూహాత్మక శక్తిని పెంచుతారు. సంతాన సమస్యలు తొలగును. ఉద్యోగ అంశాలలో రాజీ పడాలి. శారీరక మానసిక సంఘర్షణలు ఉన్ననూ ధైర్యంగా ఉండాలి. సహాయ సహకారాలపై ఆలోచనలధికం. భూలావాదేవీలలో సాధారణ స్థితి. జాయింటు దారులకు నిర్వహణ లోపాలు కనిపించును. వారాంతంలో శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. ఆదివారం రాహుకాలంలో మౌనం పాటించండి. సోమవారం ముఖ్యఅంశాలు వ్రాసి ఉంచుకోండి. 30,31 తేదీలలో పంతాలకు వెళ్లవద్దు. బుధవారం రాత్రి సమయంలో ఆకుపచ్చ దుస్తులు ధరించండి. కృత్తిక 2,3,4 జాతకులు 27 సాయంత్రం 6.04 నుంచి 28 రాత్రి 9.05 వరకు, రోహిణి జాతకులు 28 రాత్రి 9.05 నుంచి 29 రాత్రి 12.07 వరకు, మృగశిర 1,2 జాతకులు 29 రాత్రి 12.07 నుంచి 30 అర్ధరాత్రి 3.03 వరకు అన్నీ అంశాలలో జాగ్రత్త తీసుకోవాలి.



**మిథునం**
మృగశిర 3,4 పా. ఆర్ద్ర,పునర్వసు,1,2,3 పా

ఆర్థిక పరిపుష్టి పెరుగును. వ్యాపారులకు ప్రోత్సాహకాలుంటాయి. బదిలీయత్నాలు ఫలిస్తాయి. కార్యదీక్షా బాధ్యత పెరుగుతుంది. కీళ్ల నొప్పుల నుంచి ఉపశమనం. పితృవర్గ పేచీలపై దృష్టి పెట్టవద్దు. శత్రుత్వబెడద పెరుగుతుంది. హీనవ్యక్తుల పరిచయాలచే సమస్యలుత్పన్నం. ఆత్మపరిశోధనకు ప్రాధాన్యత ఇస్తారు. అకాలభోజనాలు వద్దు. చలాకీతనంతో మృదు సంభాషణలధికం. కళత్రసలహాలను స్వీకరించలేరు. గురువారం దూరప్రయాణంలో అప్రమత్తత అవసరం. మంగళవారం అనవసర అంశాలలో కలహాలు వద్దు. ధర్మకార్యాలు వాయిదా. శుక్రవారం రాహుకాలంలో మౌనం వహించండి. మృగశిర 3,4 నక్షత్ర జాతకులు 29 రాత్రి 12.07 నుంచి 30 అర్ధరాత్రి 3.03 వరకు, ఆర్ద్ర జాతకులు 30 అర్ధరాత్రి 3.03 నుంచి ఆగస్టు 1 ఉదయం 5.46 వరకు, పునర్వసు 1,2,3 జాతకులకు ఆగస్టు 1 ఉదయం 5.46 నుంచి మరునాడు ఉదయం 8.05 వరకు వ్యతిరేక సమయమని భావించాలి.



**కర్కాటకం**
పునర్వసు 4 పా. పుష్యమి, ఆశ్లేష

జాయింటు వ్యాపారాలలో పురోగతి. ఉదరసమస్య ఉండును. స్నేహితులతో మనస్పర్థలు. కార్యదీక్షాబాధ్యతను తీసుకుంటారు. సంతానంచే స్వల్పంగా అశాంతి. ఆత్మవిశ్వాసంతో ఆర్థికలబ్ధి లభించును. పితృనిర్ణయాలు శిరసావహిస్తారు. శత్రువర్గ వైష్యమ్యాల సమాచారం సేకరిస్తారు. అధికారుల వత్తిడి అధికం. గృహనిర్మాణ పనులు శ్రద్ధగా ఆచరిస్తారు. బ్యాంకులావాదేవీలలో అప్రమత్తంగా ఉండాలి. ఆధ్యాత్మిక విషయాలలో పాల్గొంటారు. గర్భిణులకు తీపివార్తలు. తోటి ఉద్యోగులపై అసత్య ఆరోపణలు వద్దు. శుక్రవారం మధ్యాహ్నభోజనంలో పెరుగును తప్పక తినండి. రాత్రి సమయంలో అల్పాహారాన్ని తీసుకోండి. సోమవారం నాడు తెలుపు రంగు దుస్తులను ధరించండి. పునర్వసు 4వపాద జాతకులకు ఆగస్టు 1 ఉదయం 5.46 నుంచి మరునాడు ఉదయం 8.05 వరకు అనుకూల సమయం కాదని భావించాలి. పుష్యమి, ఆశ్లేష జాతకులకి వ్యతిరేక సమయాలు లేవు.



**సింహం**
మఖ, పుబ్బ ఉత్తర 1 పా

అకాలభోజనాదులున్నాయి. సోమవారం సంయమనంతో కార్యసిద్ధి. వాహన నిర్ణయంలో ఆలస్యం చేస్తారు. వ్యాపారస్థులపై అధికార నిఘా వుంటుంది. అనవసర కలహాలకు దూరంగా ఉంటారు. ఆర్థికస్థితి వారం మధ్య నుంచి పెరుగును. ఉద్యోగస్థులకు అధికారులచే ప్రశంసలు. భూ, గృహమార్పులు చోటుచేసుకొంటాయి. వివేకంతో వ్యవహరిస్తూ పిత్రార్జిత అంశాలపై దృష్టి ఉంచాలి. ముఖ్య నిర్ణయాలలో ఇతరుల జోక్యం వద్దు. ఆదివారం రాహుకాలంలో మౌనం పాటిస్తూ, లాభార్జనకై ఆలోచనలు చేయండి. 27,28 తేదీలలో సంతాన విషయాలలో హడావిడి నిర్ణయాలు వద్దు. ఆగస్టు 1న మధ్యాహ్నభోజనంలో పులుపు తినవద్దు. మఖ జాతకులకు జూలై 26 సూర్యోదయం నుంచి మధ్యాహ్నం 3.10 వరకు, పుబ్బ వారికి 26 మధ్యాహ్నం 3.10 నుంచి 27 సాయంత్రం 6.04 వరకు, ఉత్తర1వ పాదం వారికి 27 సాయంత్రం 6.04 నుంచి 28 రాత్రి 9.05 వరకు అనుకూల సమయం కాదని గ్రహించాలి.



**కన్య**
ఉత్తర 2,3,4పా. హస్త, చిత్తా 1, 2 పా

బంధువుల ద్వారా లబ్ధి పొందుతారు. సాహసకృత్యాలకు ప్రాధాన్యత ఇస్తారు. స్పెక్యులేషన్ అనుకూలం కాదు. శత్రు ఋణ అంశాలపై దృష్టి నిలపలేరు. కళత్రభోగం పరిఢవిల్లును. వ్యాపార ఉద్యోగాదులలో నూతనోత్సాహంతో ఉంటారు. విధాన మార్పులచే విజయం. లాభార్జనకై నూతన ఆలోచనలు చేస్తారు. దూర ప్రయాణాలు లాభించవు. వాగ్దానభంగాలుండవు. ఉన్నతస్థాయి వ్యక్తులతో సమయస్ఫూర్తితో వ్యవహరించాలి. తోబుట్టువులతో సహకరించండి. మంగళవారం విమర్శలను గుప్పించవద్దు. 28న రాత్రి భోజనంలో పెరుగును తప్పక తినండి. ఆనాడు ముఖ్య విషయాలలో శీఘ్రనిర్ణయాలకు స్వస్తి చెప్పండి. ఉత్తర 2,3,4 జాతకులకు జూలై 27 సాయంత్రం 6.04 నుంచి 28 రాత్రి 9.05 వరకు, హస్త 28 రాత్రి 9.05 నుంచి 29 రాత్రి 12.07 వరకు, చిత్ర 1,2 జాతకులకు 29 రాత్రి 12.07 నుంచి 30 అర్ధరాత్రి 3.03 వరకు ప్రతికూల సమయమని భావించాలి.

# వారఫలాలు

**గ్రహ సంచారం**

*మిథునంలో 29 ఉ5.39 వరకు బుధుడు తదుపరి కర్కాటక ప్రవేశం; శుక్రుడు మిథునంలో; కర్కాటకంలో రవి, గురులు; కుజుడు, శని తులలో; రాహువు కన్యలో, కేతువు మీనంలో ఉండగా, చంద్రుడు మిథునం నుంచి కన్య వరకు 4 రాశులలో సంచారం.*

**ముఖ్య దినాలు**

28తేది శ్రావణచంద్రోదయం.
30తేది మధుశ్రావావ్రతం.
31తేది నాగచతుర్థి.
ఆగస్టు 1తేది గరుడపంచమి.

**సాధారణ శుభ సమయాలు**

**భారత్‌లో** ఆగస్టు 1 శుక్ర ఉ6.55 నుంచి 8.24 వరకు, మళ్లీ సా5.39 నుంచి 7.31 వరకు.

**న్యూయార్క్‌లో** 28 సోమ మ3.05 నుంచి 4.21 వరకు, 31 గురు ఉ5.58 నుంచి 9.49 వరకు, మళ్లీ రా7.20 నుంచి 8.16 వరకు, ఆగస్టు 1 శుక్ర ఉ7.15 నుంచి 8.46 వరకు, రా7.16 నుంచి 8.47 వరకు.

**లాస్‌ఏంజిల్స్‌లో** 28 సోమ ఉ8.36 నుంచి 9.59 వరకు, 31 గురు ఉ7.25 నుంచి 9.47 వరకు, మళ్లీ సా6.59 నుంచి 8.37 వరకు, ఆగస్టు 1 శుక్ర ఉ7.21 నుంచి 8.52 వరకు, మళ్లీ మ2.31 నుంచి 4.52 వరకు, మళ్లీ రా7.36 నుంచి 8.33 వరకు.

**లండన్‌లో** 31 గురు రా8.04 నుంచి 9.18 వరకు, ఆగస్టు 1 శుక్ర ఉ6.56 నుంచి 8.32 వరకు, మళ్లీ మ3.28 నుంచి 6.04 వరకు, తిరిగి రా8.00 నుంచి 9.14 వరకు.

# పంచాంగం

**జూలై తిథులు**

**ఆషాఢ బహుళ**

**26 శని** అమావాస్య: తె4.12; పునర్వసు: మ3.10; వర్జ్యం: రా12.08–1.56; దుర్ము: ఉ5.50–7.32; అమృత: మ12.30 –2.17; వజ్రయోగం:తె4.58; చతుష్పాత్ కరణం: మ3.03; నాగవకరణం: తె4.12.

**శ్రావణ శుద్ధ**

**27 ఆది** పాడ్యమి: పూర్తిగా; పుష్యమి: సా6.04; వర్జ్యం: లేదు; దుర్ము: సా4.55–5.47; అమృత: ఉ10.54–12.42; సిద్ధియోగం: పూర్తిగా; కింస్తుఘ్నకరణం: సా5.22; బవకరణం: పూర్తిగా.

**28 సోమ** పాడ్యమి: ఉ6.35; ఆశ్లేష: రా9.05; వర్జ్యం: ఉ8.29–10.17; దుర్ము: మ12.40–1.31, మ3.13–4.04; అమృత: రా7.17–9.05; సిద్ధియోగం: ఉ5.55; బవకరణం: ఉ6.35; బాలవకరణం: రా7.48.

**29 మంగళ** విదియ: ఉ9.03; మఘ: రా12.07; వర్జ్యం: ఉ10.36–12.24; దుర్ము: ఉ8.24–9.15, రా11.07–11.52; అమృత: రా9.24–11.12; వ్యతీపాతయోగం: ఉ6.55; కౌలవకరణం: ఉ9.03; తైతులకరణం: రా10.16.

**30 బుధ** తదియ: మ11.29; పూర్వఫల్గుణి: రా3.03; వర్జ్యం: ఉ9.05–10.53; దుర్ము: మ11.48–12.39; అమృత: రా7.52–9.40; వరియాన్‌యోగం: ఉ7.55; గరజికరణం: మ11.29; వణిజకరణం: రా12.39.

**31 గురు** చవితి: మ1.47; ఉత్తర: తె5.46; వర్జ్యం: మ11.04–12.51; దుర్ము: ఉ10.06–10.57, మ3.12 – 4.03; అమృత: రా9.45–11.32; పరిఘయోగం: ఉ8.49; భద్రకరణం: మ1.47; బవకరణం: రా2.49.

**ఆగష్టు తిథులు**

**1 శుక్ర** పంచమి: మ3.46; హస్త: పూర్తిగా; వర్జ్యం: మ2.59 – 4.44; దుర్ము: ఉ8.25–9.15, మ12.39–1.30; అమృత: రా1.30–3.15; శివయోగం: ఉ9.30; బాలవకరణం: మ3.46; కౌలవకరణం: తె4.35.

దైవజ్ఞ పొన్నలూరి శ్రీనివాస గార్గేయ
ఫ్లాట్ నెం.149, రోడ్ నెం.11,
అలకాపురి, రంగారెడ్డిజిల్లా. హైదరాబాద్.
సెల్: 9348032385, 9348632385



**తుల**
చిత్తా 3,4 పా. స్వాతి, విశాఖ 1,2,3 పా

ఉద్యోగాంశాలలో ఉన్నతి లభించును. వాతరోగ బాధలుండును. మేధావులతో పరిచయాలు పెరుగును. స్పెక్యులేషన్‌లో విసుగు అధికం. వర్గ వైషమ్యాలను నెట్టివేస్తారు. న్యాయవాయిదాలకై సమయం కేటాయింపు. కుటుంబ మనస్పర్థలుండవు. స్థిరాస్థి అంశాలలో నిర్ణయాలు వాయిదా. చంచలత్వం తగ్గించుకుంటారు. సోమవారం నాడు పులుపు విసర్జించండి. మంగళవారం నాడు ఆవేశానికి వెళ్లవద్దు. అకాల ప్రయాణాలున్నాయి. శుక్రవారం సాయంత్రం ఇతరులతో హాస్య సంభాషణలకు ప్రాధాన్యం ఇవ్వండి. 26వ తేదీన ఎరుపురంగు దుస్తులు వీలైనంత వరకు ధరించ వద్దు. చిత్ర 3,4 పాద జాతకులు 29 రాత్రి 12.07 నుంచి 30 అర్ధరాత్రి 3.03 వరకు, స్వాతి నక్షత్ర జాతకులు 30 అర్ధరాత్రి 3.03 నుంచి ఆగస్టు 1 ఉదయం 5.46 వరకు, విశాఖ 1,2,3 పాద జాతకులు ఆగస్టు 1 ఉదయం 5.46 నుంచి మరునాటి ఉదయం 8.05 వరకు వ్యతిరేకసమయమని భావించాలి.



**వృశ్చికం**
విశాఖ 4 పా. అనూరాధ, జ్యేష్ఠ

అలౌకిక విషయాలపై ఆసక్తి పెరుగుతుంది. నమ్మకద్రోహం చేసే వ్యక్తులతో జాగ్రత్తగా వ్యవహరించాలి. వస్త్ర భూషణ లాభాదులుంటాయి. ప్రతిబంధక అంశాలపై నిర్ణయాలు వాయిదా వేస్తారు. కష్టంతోనైనా స్వీయకల్పనాశక్తి పెంచాలి. ఋణ అంశాలలో వాయిదాలు లేకుండా ప్రయత్నించండి. స్థానచలనం ఉండదు. కళత్ర విభేదాలు సర్దుమణుగుతాయి. వ్యక్తిత్వ లోపాలను కప్పిపుచ్చుకుంటారు. స్పెక్యులేషన్ ఆశాజనకం. దూరప్రయాణాలు కలిసి వస్తాయి. వారం మధ్యలో క్షమాపణలు చెప్పవలసి ఉంటుందని గమనించండి. మంగళవారం నాడు పగలు తీపిని తినవద్దు. ఆనాడు హామీ సంతకాలు చేయ వద్దు. విశాఖ 4వపాద జాతకులు ఆగస్టు 1తేది ఉదయం 5.46 నుంచి మరునాటి ఉదయం 8.05 వరకు వ్యతిరేక సమయమని భావించాలి. అనూరాధ, జ్యేష్ఠ వారికి వ్యతిరేక సమయములు లేవు.



**ధనుస్సు**
మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా

రాజీప్రయత్నాలు కలిసివస్తాయి. ముఖ్యఘట్టాన్ని విజయవంతం చేస్తారు. మిత్రసహాయం జరుగుతుంది. వారం మధ్యలో రహస్యాలు బహిర్గతం చేయవద్దు. సోమరితనంచే అనవసర ధనవ్యయముంది. సాటివ్యక్తుల వివరాలను పదే పదే అడిగిన కారణంగా అనుమానాలు పెరిగే సూచన కలదు. సంతానానికి వెసులుబాటు. వారాంతంలో శారీరక కష్టం అధికం. పంతాలతో గర్వభంగములున్నవని తెలుసుకోలేకపోతారు. సేవకుల నిర్ణయాలను వ్యతిరేకిస్తారు. జూలై 31 గురువారం మధ్యాహ్నం రాహుకాలం సమయంలో కలహాలకు దూరంగా ఉండండి. ఆ సమయంలో మాత్రమే పులుపును స్వీకరించవద్దు. మూల జాతకులు జూలై 26 సూర్యోదయం నుంచి 28 రాత్రి 9.05 వరకు, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1వపాదం వారు 26 ఉదయం 8.29 నుంచి 28 రాత్రి 9.05 వరకు ప్రతికూల సమయమని గ్రహించాలి.



**మకరం**
ఉత్తరాషాఢ 2, 3,4 పా. శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా

శీఘ్రనిర్ణయాలు తీసుకుంటారు. అకాలప్రయాణాలు మనశ్శాంతినివ్వవు. రాజకీయవాదులకు అనుకూలం కాదు. ఆర్థిక వాహన అంశాలలో జాగ్రత్తలు తప్పనిసరి. వ్యక్తిగత ప్రతిష్ఠలు ఇనుమడింపజేయును. వారాంతంలో బంధు సమాగమంచే సరిక్రొత్త ప్రణాళికలకు శ్రీకారసూచన కలదు. ఆత్మవిశ్వాసం పెంచుకుంటారు. ఎదుటివారి నుంచి ఆశించినది పూర్తిగా లభ్యం కానందున మనస్తాపం చెందుతారు. నిర్వహణ బాధ్యతలు పెంచుకుంటారు. జీవనసరళిలో మార్పులు తీసుకురావాలనే కాంక్ష పెరుగుతుంది. సోదర సంఘీభావం అనుకోకుండా తగ్గును. 27,28 మధ్యాహ్న సమయాలలో నిదురించవద్దు. ఆవేశాలకు లోను కావద్దు, భేషజాలకు వెళ్లవద్దు. ఉత్తరాషాఢ 2,3,4 జాతకులు సాయంత్రం 6.04 నుంచి 31 ఉదయం 9.43 వరకు, శ్రవణం, ధనిష్ఠ 1,2 పాద జాతకులు 28 రాత్రి 9.05 నుంచి 31 ఉదయం 9.43 వరకు ప్రతికూలసమయమని భావించాలి.



**కుంభం**
ధనిష్ఠ 3,4 పా. శతభిషం, పూర్వ భాద్ర 1,2,3 పా

ఆర్థిక లావాదేవీలలో మార్పులుంటాయి. వృత్తి ఉద్యోగ వ్యాపారాదులలో మార్పులు కనపడతాయి. మిత్ర శత్రుత్వాలు గమనించి మసలుకుంటారు. గుప్త సమాచారాన్ని సేకరిస్తారు. వైద్య, క్రీడ, సంగీత రంగాల వారికి ఊరట పొందే అవకాశాలొస్తాయి. ఆరోపణలు, హాస్యవచనాలు చేసే వ్యక్తుల కదలికలను పరిశీలించి మెలుగుతారు. పుకార్లు విని ఆర్థికంగా నష్టపోకండి. వారాంతంలో స్నేహితభావంతో సహాయ సహకారాలందించే వారిని దూరం చేసుకోవాలనే తలంపు రానివ్వవద్దు. 28, 29 తేదీలలో లోభగుణంతో ఉండవద్దు. మాంసాహారానికి దూరంగా ఉండండి. ధనిష్ఠ 3,4 నక్షత్ర జాతకులకు 29 రాత్రి 12.07 నుంచి 30 అర్ధరాత్రి 3.03 వరకు తిరిగి 31 ఉదయం 9.43 నుంచి ఆగస్టు 2 రాత్రి 8.57 వరకు, శతభిషం జాతకులకు 30 అర్ధరాత్రి 3.03 నుంచి ఆగస్టు 2 రాత్రి 8.57 వరకు, పూర్వాభాద్ర 1,2,3 పాద జాతకులకు 31 ఉదయం 9.43 నుంచి ఆగస్టు 2 రాత్రి 8.57 వరకు వ్యతిరేకసమయం.



**మీనం**
పూర్వాభాద్ర 4 పా. ఉత్తరాభాద్ర, రేవతి

మానసిక చింతనలు తగ్గుతాయి. సంయమనం పాటిస్తారు. మనోవాంఛలు తీరే అవకాశం కలదు. స్త్రీలకు శుభవార్తలు. కళత్ర సంతాన అంశాలలో నూతన నిర్ణయాలు ఫలిస్తాయి. ఉన్నతవ్యక్తుల అండకొరకు చేసే ప్రయత్నాలు సజావుగా సాగును. కానీ వివేకంతో వ్యవహరించాలని క్షణక్షణం గుర్తుంచుకోవాలి. స్పెక్యులేషన్‌లో వెనుకంజ. సమయస్ఫూర్తికి ప్రాధాన్యత ఇవ్వలేకపోతారు. ఎత్తులు పై ఎత్తులు కొంతవరకే సఫలమౌతాయి. ఋణ అంశాలపై దృష్టి అధికంగా ఉంచుతారు. 28, 31 తేదీలలో హామీ సంతకాలు చేయవద్దు. 30వతేదీన మనోనిబ్బరానికి ప్రాధాన్యతనివ్వాలి. ఆనాటి రాత్రి కలహాలకు దూరంగా ఉండండి. వైద్య నిర్ణయాలను త్రోసిపుచ్చవద్దు. రావలసిన సొమ్ము ఆలస్యమైనా ఆగ్రహానికి గురికావద్దు. పూర్వాభాద్ర 4వపాద జాతకులు ఆగస్టు 1 ఉదయం 5.46 నుంచి మరునాడు ఉదయం 8.05 వరకు వ్యతిరేక సమయమని భావించాలి. ఉత్తరాభాద్ర, రేవతి వారికి ప్రతికూల సమయములు లేవు.

## 2014 సర్వేపల్లి నియోజకవర్గ ఓట్ల వివరాలు

| బూత్ నెం | పోలింగ్ కేంద్రం | పోలైన ఓట్లు | వైఎస్ఆర్ సిపి | టిడిపి | కాంగ్రెస్ |
|---|---|---|---|---|---|
| 1 | సూరాయపాళెం | 696 | 454 | 213 | 5 |
| 2 | సూరాయపాళెం | 522 | 361 | 147 | 0 |
| 3 | విరువూరు | 875 | 577 | 257 | 5 |
| 4 | విరువూరు | 690 | 474 | 182 | 4 |
| 5 | విరువూరు | 571 | 426 | 129 | 2 |
| 6 | మహమ్మదాపురం | 919 | 404 | 457 | 5 |
| 7 | మహమ్మదాపురం | 948 | 505 | 390 | 17 |
| 8 | తాటిపర్తి | 575 | 337 | 224 | 4 |
| 9 | తాటిపర్తి | 1068 | 663 | 363 | 7 |
| 10 | తాటిపర్తి | 694 | 381 | 282 | 8 |
| 11 | తాటిపర్తి | 813 | 518 | 239 | 5 |
| 12 | నాళ్లపాళెం | 622 | 326 | 266 | 4 |
| 13 | నేదురుపల్లి | 757 | 340 | 396 | 3 |
| 14 | నేదురుపల్లి | 867 | 483 | 357 | 1 |
| 15 | ఎర్రబల్లి | 478 | 207 | 243 | 7 |
| 16 | బత్తులపల్లి | 521 | 290 | 217 | 3 |
| 17 | భోగసముద్రం | 391 | 207 | 171 | 5 |
| 18 | నావూరు | 975 | 699 | 237 | 7 |
| 19 | నావూరు | 998 | 543 | 422 | 9 |
| 20 | అమ్మవారిపాళెం | 872 | 321 | 524 | 6 |
| 21 | ప్రభగిరిపట్నం | 951 | 356 | 572 | 6 |
| 22 | అయ్యగారిపాళెం | 793 | 581 | 189 | 4 |
| 23 | కనుపర్తి | 832 | 503 | 308 | 3 |
| 24 | నరసింహకండ్రిగ | 521 | 308 | 203 | 3 |
| 25 | ఆల్తుర్తి | 741 | 520 | 207 | 1 |
| 26 | రేవళ్లఎరగుంటపాళెం | 626 | 386 | 220 | 11 |
| 27 | పులికొల్లు | 918 | 427 | 480 | 1 |
| 28 | అంకుపల్లి | 618 | 265 | 330 | 9 |
| 29 | వావింటపర్తి | 616 | 424 | 183 | 2 |
| 30 | ఊచపల్లి | 410 | 231 | 173 | 0 |
| 31 | మొగళ్లూరు | 586 | 333 | 250 | 0 |
| 31ఎ | మొగళ్లూరు | 688 | 344 | 325 | 4 |
| 32 | దుగ్గుంటరాజుపాళెం | 1114 | 614 | 439 | 9 |
| 33 | రామాపురం | 789 | 335 | 431 | 6 |
| 34 | దేగపూడి | 981 | 493 | 446 | 6 |
| 35 | దేగపూడిరాజుపాళెం | 242 | 119 | 112 | 2 |
| 36 | ఇంకుర్తి | 424 | 310 | 106 | 2 |
| 37 | ముడిగేడు | 962 | 567 | 355 | 10 |
| 38 | మర్రిపల్లి | 613 | 343 | 248 | 3 |
| 39 | పొదలకూరు | 788 | 422 | 332 | 4 |
| 40 | పొదలకూరు | 841 | 440 | 364 | 7 |
| 41 | పొదలకూరు | 573 | 273 | 276 | 7 |
| 42 | లింగంపల్లి | 652 | 238 | 377 | 10 |
| 43 | లింగంపల్లి | 676 | 316 | 326 | 4 |
| 44 | చిట్టిపల్లి | 627 | 199 | 416 | 3 |
| 45 | పుట్టాయగుంట | 566 | 275 | 267 | 4 |
| 46 | పుట్టాయగుంట | 739 | 375 | 345 | 5 |
| 47 | పుట్టాయగుంట | 669 | 319 | 332 | 4 |
| 48 | పొదలకూరు | 282 | 126 | 149 | 2 |
| 49 | పుట్టాయగుంట | 444 | 231 | 207 | 2 |
| 50 | పొదలకూరు | 774 | 365 | 377 | 3 |
| 51 | పొదలకూరు | 862 | 389 | 434 | 7 |
| 52 | పొదలకూరు | 864 | 387 | 448 | 6 |
| 53 | తోడేరు | 571 | 517 | 37 | 3 |
| 54 | తోడేరు | 804 | 753 | 36 | 3 |
| 55 | మరుపూరు | 763 | 362 | 388 | 2 |
| 56 | మరుపూరు | 866 | 383 | 464 | 1 |
| 57 | చాటగొట్ల | 839 | 408 | 419 | 2 |
| 58 | పార్లపల్లి | 873 | 562 | 281 | 6 |
| 59 | బిరదవోలు | 778 | 236 | 496 | 15 |
| 60 | బిరదవోలు | 619 | 309 | 292 | 4 |
| 61 | బ్రాహ్మణపల్లి | 225 | 68 | 141 | 6 |
| 62 | చిన్నచెరుకూరు | 670 | 235 | 402 | 7 |
| 63 | చిన్నచెరుకూరు | 616 | 323 | 263 | 4 |
| 64 | నరుకూరు | 1146 | 550 | 551 | 13 |
| 65 | నరుకూరు | 1006 | 485 | 484 | 3 |
| 66 | పేడూరు | 978 | 429 | 455 | 11 |
| 67 | పేడూరు | 877 | 377 | 409 | 7 |
| 68 | చింతోపు | 776 | 363 | 397 | 1 |
| 69 | ముంగలదొరువు | 756 | 343 | 390 | 3 |
| 70 | సౌత్ఆములూరు | 771 | 215 | 526 | 7 |
| 71 | సౌత్ఆములూరు | 800 | 475 | 295 | 6 |
| 72 | రావూరివారికండ్రిగ | 686 | 310 | 343 | 5 |
| 73 | రావూరివారికండ్రిగ | 445 | 245 | 182 | 5 |
| 74 | వరిగొండ | 692 | 321 | 336 | 9 |
| 75 | వరిగొండ | 559 | 224 | 308 | 3 |
| 76 | వరిగొండ | 636 | 376 | 227 | 5 |
| 77 | గమళ్లపాళెం | 625 | 381 | 215 | 2 |
| 78 | తోటపల్లిగూడూరు | 895 | 532 | 313 | 1 |
| 79 | తోటపల్లిగూడూరు | 624 | 282 | 319 | 4 |
| 80 | ఇస్కపాళెం | 1101 | 477 | 562 | 5 |
| 81 | పాపిరెడ్డిపాళెం | 781 | 393 | 355 | 5 |
| 82 | పాపిరెడ్డిపాళెం | 696 | 280 | 366 | 3 |
| 83 | తోటపల్లి | 907 | 432 | 443 | 4 |
| 84 | కొత్తనక్కావారిపాళెం | 262 | 174 | 73 | 4 |
| 85 | మాచర్లవారిపాళెం | 1015 | 608 | 376 | 11 |
| 86 | విలుకానిపల్లి | 873 | 369 | 450 | 7 |
| 87 | పొట్లపూడి | 749 | 386 | 334 | 4 |
| 88 | పొట్లపూడి | 596 | 302 | 253 | 6 |
| 89 | కొత్తపాళెం | 894 | 436 | 408 | 4 |
| 90 | వెంకన్నపాళెం | 1013 | 499 | 468 | 6 |
| 91 | వెంకన్నపాళెం | 495 | 230 | 241 | 5 |
| 92 | మహలక్ష్మీపురం | 769 | 323 | 403 | 11 |
| 93 | మహలక్ష్మీపురం | 614 | 273 | 303 | 11 |
| 94 | కొత్తకోడూరు | 680 | 353 | 294 | 5 |
| 95 | కోడూరు-2 | 950 | 350 | 536 | 14 |
| 96 | నెల్లిమిట్టకండ్రిగ | 624 | 351 | 234 | 7 |
| 97 | నెల్లిమిట్టకండ్రిగ | 928 | 374 | 484 | 9 |
| 98 | ఈదూరు-1 | 466 | 299 | 154 | 2 |
| 99 | ఈదూరు-1 | 580 | 249 | 316 | 3 |
| 100 | మల్లిఖార్జునపురం | 874 | 462 | 354 | 3 |
| 101 | వరకవిపూడి | 650 | 445 | 181 | 3 |
| 102 | వరకవిపూడి | 652 | 434 | 186 | 6 |
| 103 | మండపం | 1186 | 658 | 453 | 6 |
| 104 | అనంతపురం | 470 | 299 | 151 | 4 |
| 105 | గోవిందరెడ్డిపాళెం | 433 | 198 | 216 | 3 |
| 106 | ఈదూరువారిపాళెం | 854 | 373 | 436 | 4 |
| 107 | బ్రహ్మదేవం | 645 | 289 | 342 | 3 |
| 107ఎ | బ్రహ్మదేవం | 637 | 261 | 358 | 5 |
| 108 | బ్రహ్మదేవం | 904 | 448 | 418 | 5 |
| 109 | జంగాలకండ్రిగ | 593 | 306 | 280 | 2 |
| 110 | పిడతాపోలూరు | 847 | 335 | 473 | 7 |
| 111 | పిడతాపోలూరు | 871 | 399 | 431 | 6 |
| 112 | ముసునూరివారిపాళెం | 946 | 381 | 530 | 6 |
| 113 | ముసునూరివారిపాళెం | 402 | 230 | 149 | 2 |
| 114 | దిబ్బమీద హరిజనవాడ | 1007 | 491 | 462 | 9 |
| 115 | నేలటూరు | 757 | 415 | 293 | 6 |
| 116 | నేలటూరు | 691 | 324 | 323 | 12 |
| 117 | మామిడిపూడి | 925 | 383 | 478 | 4 |
| 118 | కావలి హరిజనవాడ | 386 | 266 | 103 | 1 |
| 119 | తాళ్లపూడి | 684 | 360 | 291 | 5 |
| 120 | వల్లూరు | 801 | 304 | 465 | 13 |
| 121 | అచ్చన్నతోపు | 904 | 441 | 434 | 10 |
| 122 | పొట్టెంపాడు | 954 | 484 | 430 | 6 |
| 123 | దువ్వూరువారిపాళెం | 534 | 264 | 247 | 5 |
| 124 | పోలంరాజుగుంట | 370 | 163 | 193 | 2 |
| 125 | దమ్మాయపాళెం | 900 | 398 | 458 | 16 |
| 126 | కుమ్మరిమిట్ట | 658 | 398 | 237 | 3 |
| 127 | ముత్తుకూరు | 748 | 334 | 374 | 4 |
| 128 | ముత్తుకూరు | 833 | 355 | 448 | 5 |
| 129 | ముత్తుకూరు | 886 | 346 | 496 | 10 |
| 130 | ముత్తుకూరు | 698 | 310 | 372 | 3 |
| 130ఎ | ముత్తుకూరు | 702 | 339 | 326 | 3 |
| 131 | ముత్తుకూరు | 769 | 394 | 333 | 7 |
| 132 | ముత్తుకూరు | 592 | 247 | 308 | 4 |
| 133 | ముత్తుకూరు | 394 | 190 | 181 | 4 |
| 134 | ముత్తుకూరు | 932 | 358 | 503 | 7 |
| 135 | గోపాలపురం | 687 | 339 | 325 | 10 |
| 136 | గోపాలపురం | 607 | 287 | 299 | 4 |
| 137 | కృష్ణపట్నం | 1063 | 507 | 526 | 3 |
| 138 | కృష్ణపట్నం | 891 | 488 | 379 | 4 |
| 139 | బలిజపాళెం | 583 | 179 | 350 | 3 |
| 140 | నారికేళ్లపల్లి | 650 | 262 | 366 | 5 |
| 141 | నారికేళ్లపల్లి | 778 | 403 | 338 | 3 |
| 142 | పంటపాళెం | 881 | 451 | 397 | 13 |
| 143 | పంటపాళెం | 814 | 433 | 356 | 9 |
| 144 | ఈపూరు | 604 | 331 | 255 | 8 |
| 145 | వెంకన్నపాళెం | 984 | 546 | 404 | 7 |
| 146 | వెంకన్నపాళెం | 927 | 466 | 448 | 0 |
| 147 | మిట్టపాళెం | 734 | 68 | 651 | 3 |
| 148 | పాలిచెర్లపాడు | 775 | 421 | 325 | 11 |
| 149 | చింతలపాళెం | 739 | 443 | 245 | 5 |
| 150 | కసుమూరు | 499 | 262 | 225 | 2 |
| 150ఎ | కసుమూరు | 556 | 326 | 206 | 3 |
| 151 | కసుమూరు | 1042 | 578 | 400 | 10 |
| 152 | కసుమూరు | 617 | 282 | 312 | 5 |
| 153 | మంగలగుంట | 590 | 90 | 486 | 1 |
| 154 | కురిచెర్లపాడు | 541 | 200 | 315 | 7 |
| 155 | కురిచెర్లపాడు | 492 | 270 | 205 | 5 |
| 156 | ఇస్లాంపేట | 357 | 238 | 108 | 6 |
| 157 | చవటపాళెం | 822 | 268 | 535 | 5 |
| 158 | చవటపాళెం | 394 | 117 | 263 | 4 |
| 159 | ఎర్రగుంట | 525 | 150 | 350 | 9 |
| 160 | వెంకటాచలం | 511 | 288 | 199 | 7 |
| 160ఎ | వెంకటాచలం | 514 | 297 | 198 | 1 |
| 161 | వెంకటాచలం | 920 | 425 | 459 | 3 |
| 162 | కనుపూరు | 878 | 364 | 500 | 2 |
| 163 | కనుపూరు | 691 | 389 | 273 | 4 |
| 164 | కందలపాడు | 517 | 224 | 268 | 6 |
| 165 | చెముడుగుంట | 506 | 186 | 295 | 6 |

కొరవ 15వ పేజీలో

# ICE క్రీమ్ ఒక చెత్త సినిమా!



✍ అల్లూరు రహీం

రామ్‌గోపాల్ వర్మ ఒకప్పుడు తెలుగు, హిందీ సినీ పరిశ్రమల్లో ట్రెండ్‌సెట్ చేసిన దర్శకుడు. శివ, క్షణ క్షణం, సత్య, రంగీలా, సర్కార్ చిత్రాలు అందరూ మెచ్చేలా తీశారు. కొన్నేళ్లకు మాఫియా సినిమాలపై మొగ్గారాయన. మధ్యలో దెయ్యాల సినిమాలు తీయనారంభించాడు. ఈ మధ్య అయితే రక్తచరిత్ర లాంటి బోర్ సినిమాలకు కాస్త గ్యాప్ ఇచ్చి దెయ్యాల సినిమాలకు మళ్లుకొన్నాడు. భీమవరం టాకీస్ పతాకంపై ఆయన తాజాగా తీసిన సినిమానే ఐస్‌క్రీం. ఈ సినిమాను సినిమా అనాలా లేక రామ్‌గోపాల్ వర్మకు పిచ్చి ముదిరి తీశాడా అని సినిమా చూస్తున్న ప్రతి ఒక్కరికీ సందేహం కలుగుతుంది. ఫ్లోకామ్ కెమెరాతో 104 నిమిషాల ఈ సినిమాను 2,11,832 రూపాయలు ఖర్చుతో తీశానని రామ్‌గోపాల్ వర్మ గొప్పగా చెప్పాడు. ఈ సినిమా తీయడానికి 2012 సంవత్సరం జూన్ 26వ తేదీ బెంగుళూరులోని ఒక ఇంట్లో జరిగిన యదార్థ సంఘటన ఆధారంగా చేసుకొన్నానని ఆయన చెప్పుకొచ్చాడు. ఇప్పటికీ ఆ అమ్మాయి హాస్పిటల్‌లో చికిత్స పొందుతుందనీ చిత్రం చివరన మళ్లీ చెప్పాడు. ఈ సినిమాలో పాటలు లేవు. చెప్పుకోతగ్గ మాటలు లేవు. ఎడిటర్ సినిమా నిడివి తగ్గించాల్సిన అవసరం కూడా లేకుండా పోయింది. నా ఇష్ట మొచ్చినట్లు సినిమాలు తీస్తాను. చూస్తే చూడండి లేకుంటే లేదనే పొగరు జాస్తయి వర్మ ఐస్‌క్రీం సినిమా తీశాడని చెప్పేయవచ్చు. వర్మ దగ్గర ఒక కళ ఉంది. పబ్లిసిటీతో సినిమాకు ప్రేక్షకుడిని రప్పించే ప్రయత్నం చేయడం. సరికొత్త తార తెలుగమ్మాయి తేజస్వి కాస్త బోల్డ్‌గా నవదీప్‌తో కలిసి ఆయన వేయించిన పోస్టర్ ఈ సినిమాకు ప్రేక్షకుడిని వెళ్లేటట్లు చేస్తుంది. వెళ్లాక రామ్‌గోపాల్ వర్మను హాల్‌లో తిట్టిన తిట్టు తిట్టకుండా బయటకు వచ్చేలా చేస్తుంది.

చిత్ర సమీక్ష

ఈ చెత్త కథలోనికి వెళ్తే మెడికల్ స్టూడెంట్ రేణు(తేజస్వి) వాళ్లు కొత్త ఇంట్లో చేరుతారు. ఇంతలో బంధువుల అమ్మాయికి పెళ్లి కుదరడంతో రేణును ఇంట్లో వదలి వెళ్తారు. అమ్మా – నాన్న వూళ్లోలేరని బాయ్ ఫ్రెండ్ విశాల్(నవదీప్)ని ఇంటికి పిలుస్తుంది. విశాల్ ఆ ఇంట్లో వాస్తు రీత్యా పెట్టి ఉండే ఒక వస్తువును కాలితో తన్ని వేస్తాడు. అక్కడ నుండి లోపలికి రేణు అలా వెళ్లగానే ఎవరో తలుపు కొట్టినట్లు, పియానో వాయించినట్లు, షింక్‌లో నీరు కారినట్లు, అద్దంలో ఒక ముసలావిడ కూడా వస్తారు. వాళ్లంతా రేణును గందరగోళానికి గురి చేస్తారు. ఇంట్లో ఎవరెవరో కనపడుతున్నారని రేణు విశాల్‌కు చెప్పినా అతను నమ్మడు. ఆమెను అదంతా భ్రమంటాడు. ఒక రోజు రాత్రి ఇంట్లో విశాల్ ఉండగానే ఆ ఇంట్లో తిష్టవేసిన దెయ్యాలన్నీ రెచ్చిపోతాయి. ఈ దెయ్యాలతో రేణు కూడా కలిసి పోతుంది. తాను దెయ్యంగా మారానని చెబుతూ విశాల్‌ను చంపేయడంతో చిత్రం ముగిసి పోతుంది.

ఈ సినిమా తేజస్వికి కొన్ని సినిమాలు తెచ్చి పెట్టవచ్చు. ఈ సినిమాలో ఆమె నవదీప్‌కు ముద్దులిస్తుంది. సినిమా అంతా పొట్టి పొట్టి దుస్తులతో కనపడుతుంది. టబ్‌లో సైతం స్నానంచేస్తూ ప్రేక్షకులను ఊరిస్తుంది. ఐస్‌క్రీం సినిమాను ఏమి ఆశించి రామ్‌గోపాల్ వర్మ తీశారో ఆయనే చెప్పాలి! లేని తలనొప్పి తెచ్చుకోను ఐస్‌క్రీంకు వెళ్లొచ్చు.



## బిపాస... బవేజాకు లైన్ క్లియర్!

బిపాసబసు, జాన్ అబ్రహాం కలిసి తిరుగుతున్నప్పుడు ఒకటే హాట్ న్యూస్‌లు. ఇద్దరూ విడిపోయినా బిపాసా మాత్రం వార్తల్లో నిలుస్తూనే వుంది. బిపాస త్వరలోనే హర్మన్ బవేజాని పెళ్లి చేసుకోబోతుందని, ఈ పెళ్లికి ఇరు కుటుంబాలు అంగీకరించాయని బాలీవుడ్ సమాచారం. గత కొంత కాలంగా వీరిద్దరి మధ్య ప్రేమ వ్యవహారం నడుస్తోంది. మీడియా ముందు బయటపడక పోయినా... అది బహిరంగ రహస్యమే. బిపాసా ఇంట్లో జరిగే విందులు, వినోదాలకు బవేజా కుటుంబ సభ్యులతో సహా హాజరవుతున్నాడట. అలాగే బవేచా ఇంట్లో ఏవైనా శుభకార్యాలు జరుగుతుంటే స్వయంగా బిపాసా కుటుంబం దగ్గరుండి మరీ అన్ని పనులు చక్కబెడుతున్నారట. ఈ జంట త్వరలోనే మీడియా ముందు తమ ప్రేమ వ్యవహారాన్ని బయటపెట్టే అవకాశాలున్నాయని తెలుస్తోంది. ఇరు కుటుంబాల వాళ్లు పెళ్లికి తొందర పెడుతుంటే వీళ్లు మాత్రం ఏం చేస్తారు?

## జాక్వెలైన్‌కు బహుమతి



హీరో సల్మాన్‌ఖాన్ సంతోషం వచ్చినా, కోపం వచ్చినా కంట్రోల్ చేసుకోలేడు. అతని బహుమానాలు భారీగానే ఉంటాయి. మొన్నా మధ్య అసిస్టెంట్‌కు ఒక ప్లాట్ గిఫ్ట్‌గా ఇచ్చాడని బాలీవుడ్ మొత్తం కోడైకూసింది. ఇప్పుడు హీరోయిన్ జాక్వెలైన్ ఫెర్నాండెజ్‌కి ట్రిబుల్ బెడ్‌రూమ్ ప్లాట్ బహుమానంగా ఇచ్చారట. అదీ ముంబైలోని అత్యంత ఖరీదైన బాంద్రా ప్రాంతంలో. ఇది విని చాలా మంది జనాలు జాక్‌పై సల్మాన్‌కు ఇంత ప్రేమ ఎందుకు పుట్టిందా అని ఆశ్చర్య పోతున్నారట. సల్మాన్ హీరోగా నటించిన 'కిక్' సినిమాలో జాకీతో కలసి జుమ్మేకి రాత్ అంటూ హాట్‌హాట్‌గా చిందులేశాడు సల్మాన్. ఈ పాటలో జాక్వీ స్టెప్పులు సల్మాన్‌కు విపరీతంగా నచ్చేశాయట. ఆ సంతోషంతోనే జాక్‌కి సల్మాన్ బెడ్‌రూమ్ బహుమతిగా ఇచ్చాడని బాలీవుడ్ జనాలు చెప్పుకొంటున్నారు.

## నేను బాగానే ఉన్నా!



అచ్చ తెలుగు అందం అంజలిది. సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు చిత్రం ఆమెను ఎక్కడికో తీసుకెళ్లింది. కానీ బలుపు, మసాలా చిత్రాలు ఆమె కెరీర్‌ను ఆదుకోలేదు. తమిళ పరిశ్రమలో దర్శకుడు కళైంజియమ్‌తో గొడవ వల్ల అక్కడా సినిమాలు లేకుండా పోయాయి. తన వ్యక్తిగత జీవితంపై ఇటీవల రేగుతున్న ప్రచారంపై ఆమె స్పందించింది. నా వెనుక ఎవరో ఉన్నారని ప్రచారం జరుగుతోంది. అదంతా ఒట్టి పుకారే. అలాగే నాకు ఒంట్లో బాగోలేదని కూడా మాట్లాడుకొంటున్నారు. అది కూడా అబద్ధమే. నేను పూర్తిస్థాయిలో ఆరోగ్యంగా ఉన్నా. తెలుగు, తమిళ చిత్రాల్లో నటిస్తూ ఉంటా అని చెప్పుకొచ్చింది.

## తెలుగమ్మాయిలను తొక్కేస్తారు!



తేజస్వి అచ్చ తెలుగమ్మాయి. సీతమ్మ వాకిట్లో సిరిమల్లె చెట్టు, హార్ట్ ఎటాక్, మనం చిత్రాల్లో చిన్న చిన్న పాత్రలు పోషించిన ఆమెను 'ఐస్‌క్రీమ్' సినిమాతో రామ్‌గోపాల్ వర్మ హీరోయిన్‌ను చేశాడు. హీరోయిన్‌గా అనుభవమెలా ఉందంటే చాలా హ్యాపీగా ఫీలవుతున్నా. వర్మ 'సార్' గూర్చి ప్రత్యేకంగా చెప్పాల్సిన పనిలేదు. నటీనటులకు కావాల్సినంత స్వేచ్ఛ ఇస్తారు. ఆయన పరిచయం చేసిన హీరోయిన్లంతా స్టార్స్‌గా ఎదిగారు. వర్మ సినిమాలో నటిస్తే... దాదాపుగా అన్ని భాషల్లోనూ గుర్తింపు సాధించినట్టే. ఈ ఒక్క సినిమాతో ఎంతో నేర్చుకొనే అవకాశం దక్కిందంది. అయితే తెలుగు పరిశ్రమలో తెలుగమ్మాయిలకు అవకాశాలు ఇవ్వరు. ఇస్తే ముంబై భామలకు ఏమాత్రం తీసిపోరని గట్టిగా చెప్పింది.

## ఏమీ దాచుకోను



షెర్లీన్‌చోప్రా అందం మిరపకాయ ఘాటు. ఈమె పుట్టింది... పెరిగింది హైదరాబాద్‌లోనే. ఎ ఫిల్మ్ బై అరవింద్ సినిమాలో హీరోయిన్‌గా నటించి బాలీవుడ్‌కు వెళ్లి అక్కడ నుంచి ప్లేబాయ్ మేగజైన్ కోసం నగ్నంగా ఫోజులిచ్చి వార్తల్లో నిలిచింది. తన గూర్చి జనం నిత్యం మాట్లాడుకుంటూనే ఉండాలంటోంది షెర్లీన్‌చోప్రా. అందుకే ట్విట్టర్, ఫేస్‌బుక్‌లో హాట్‌హాట్ భంగిమలో ఫోటోలు పోస్ట్‌చేస్తూ వార్తల్లో నిలుస్తుంటుంది. అలాగే తన మనసులోని అభిప్రాయాలను దాచుకోదు. శృంగారం అందులో అనుభవాలను గూర్చి అమ్మడు సోషల్ నెట్‌వర్క్‌లో చెప్పే విషయాలు సంచలనాలు సృష్టిస్తాయి. అయినా షెర్లీన్ మాత్రం వెనక్కి తగ్గదు. అదే ఆమె ప్రత్యేకత.



మెడికల్ కాలేజి ప్రారంభోత్సవ సభలో మాట్లాడుతున్న ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు.

# నెల్లూరుపై సిఎం వరాల జల్లు!

## వచ్చే ఐదేళ్లలో సమస్యలు పరిష్కార హామీ

నెల్లూరు మెడికల్ కాలేజి ప్రారంభోత్సవానికి విచ్చేసిన ముఖ్యమంత్రి చంద్రబాబు నెల్లూరు జిల్లాపై వరాల జల్లు కురిపించారు. రాష్ట్ర ఆర్థిక పరిస్థితులు ఏమంత బాగోలేవు. మన రాష్ట్ర ఆదాయ వ్యయాలు జూలై నెలాఖరుకు గానీ వెల్లడి కావు. అయినా సరే రాష్ట్ర ప్రజలకు నేనిచ్చిన వాగ్దానాలన్నీ నెరవేరుస్తానన్నారు. జిల్లాలో సాగునీటి సమస్య పరిష్కారానికి సోమశిల ప్రాజెక్టుకు అదనపు నిధులు కేటాయిస్తాను. సంగం, నెల్లూరు బ్యారేజీ నిర్మాణాలు పూర్తి చేయిస్తాను. తెలుగు గంగ లింకు కాల్వల నిర్మాణానికి సహకరిస్తాను. దీనిమూలంగా పెన్నా డెల్టాలో 13 లక్షల ఎకరాలను పండించవచ్చన్నారు. జువ్వలదిన్నెలో ఫిషింగ్ హార్బర్, పులికాట్ ముఖ ద్వారంలో పూడిక కూడా తీయిస్తానన్నారు. నెల్లూరును స్మార్ట్ సిటీల జాబితాలో చేరుస్తాను. ఎయిర్ పోర్ట్ ఏర్పాటు స్థాపక అవకాశాలు మెరుగు పరుస్తాను. కృష్ణపట్నం డీప్ వాటర్ పోర్ట్; దీనికి అనుబంధంగా పారిశ్రామిక నగరానికి అన్నివిధాల సహకరిస్తామన్నారు. చెన్నై – కలకత్తా మధ్య పదిలైన్ల జాతీయ రహదారి ఏర్పాటు వల్ల నెల్లూరుకు కూడా మేలు జరుగుతుందన్నారు. నెల్లూరు, చిత్తూరు, అనంతపురం జిల్లాలను బెంగుళూరుతో కలిపి పారిశ్రామిక హబ్‌ను ఏర్పాటు చేస్తామన్నారు. 575 కోట్ల రూపాయల వ్యయమయ్యే భూగర్భ డ్రైనేజి, 550 కోట్ల రూపాయలు ఖర్చయ్యే ప్రత్యేక తాగునీటి పథకానికి కూడా రెండు రోజుల్లో రాష్ట్ర ప్రభుత్వం అన్ని హామీలిచ్చి కేంద్రం నిధులు వచ్చేదానికి కృషి చేస్తానన్నారు.

# అధిక ధరలకు పుస్తకాలు!

## ప్రైవేటు పాఠశాలల తీరిది



ప్రైవేటు పాఠశాలల్లో విద్యార్థులకు అధిక ధరలకు పుస్తకాలు, నోటు పుస్తకాలు విక్రయిస్తున్నారు. విద్యాశాఖ నిబంధనల ప్రకారం పాఠశాలల్లో ఎటువంటి పుస్తకాలు విక్రయించరాదు. అయినా కూడా పాఠశాలల యాజమాన్యం విద్యాశాఖ నిబంధనలను ఏమాత్రం ఖాతరు చేయకుండా విద్యార్థులను పుస్తకాలు తప్పనిసరిగా కొనుగోలు చేయాలని ఒత్తిడి చేస్తూ అంటగడుతున్నారు. తెలుగు, ఇంగ్లీషు మీడియంలో విద్యనభ్యసిస్తున్న ప్రతి ఒక్క విద్యార్థి ప్రభుత్వం ముద్రించిన, ఆమోదించిన పుస్తకాలను కొనుగోలు చేయాల్సి వుంటుంది. కొన్ని పాఠశాలల నిర్వాహకులు బయట వ్యక్తులతో ఒప్పందం చేసుకుని పాఠశాలలోనే దుకాణం ఏర్పాటు చేస్తున్నారు. తరగతుల వారీగా అన్ని అచ్చు పుస్తకాలు, నోటు పుస్తకాలు ఇతర సామాగ్రిని కలిపి ఒక ధరగా నిర్ణయించి విక్రయిస్తున్నారు. పాఠశాలల యాజమాన్యం నిర్ణయించిన పుస్తకాల్లో కొన్ని బయట దొరకడం లేదు. ప్రభుత్వం ముద్రించి, ఆమోదించిన పుస్తకాలు మార్కెట్ ధరకంటే కొంత ఎక్కువ ధరకు విక్రయిస్తున్నారు. తల్లితండ్రులు ప్రశ్నించినప్పుడు తమ పాఠశాలలో విక్రయించే పుస్తకాలనే కొనాలని షరతు పెడుతున్నారు. విద్యాశాఖ అధికారులకు ఈ విషయం తెలిసినప్పటికీ పుస్తకాలు విక్రయించే పాఠశాలల యాజమాన్యాలపై ఎటువంటి చర్యలు తీసుకోవడం లేదు. కొన్ని పాఠశాలల్లో తాటాకులతో నిర్మించిన క్లాసు రూమ్‌లు వున్నాయి. ఏదైనా ఊహించని ప్రమాదం సంభవిస్తే జరిగే పరిణామాలు ఊహించలేనివి. ఇప్పటికైనా విద్యాశాఖ అధికారులు స్పందించి ప్రైవేటు పాఠశాలల యాజమాన్యంపై కఠిన చర్యలు తీసుకోవాల్సిన అవసరం వుంది.

# ఇష్టమొచ్చినట్లు నడుస్తున్న సిటీ బస్సులు!

## అడ్డగించే వారు లేరు



నగరంలో ప్రైవేట్ బస్సుల ఇష్టారాజ్యం.

నగరంలో ప్రైవేట్ సిటీ బస్సులది ఇష్టారాజ్యం అయ్యింది. రవాణా శాఖ అనుమతులు లేకపోయినా వివిధ రూట్లకు యదేచ్ఛగా బస్సులను తిప్పుతూ తమ రూటే సపరేటు అన్నట్లు వ్యవహరిస్తున్నారు. ప్రభుత్వ అనుమతులులేని రూట్లలో బస్సులు నడపడం వల్ల ప్రభుత్వానికి రావాల్సిన ఆదాయం అందకుండా పోతోంది. నగరంలో తిరిగే బస్సులన్నీ ప్రైవేట్ నిర్వాహకులవే. అందులోనూ అన్నీ ఒక సంస్థకు చెందిన బస్సులే. దాదాపు అన్ని బస్సులను చేజిక్కించుకొని గుత్తాధిపత్యంగా వ్యవహరిస్తున్న ఈ బస్సుల నిర్వాహకులు రూటు పర్మెట్లు ఒక దగ్గర తీసుకుని బస్సులు మాత్రం మరో దగ్గరికి నడుపుతున్నారు. అయ్యప్పగుడి నుంచి బోసుబొమ్మ వరకు తిరిగే బస్సులు అధికం. అయితే అయ్యప్పగుడి వరకు మాత్రమే నడపాల్సిన బస్సులను బుజబుజనెల్లూరు వరకు నడుపుతూ రవాణాశాఖ నిబంధనలు పాటించకుండా తమ జేబులు నింపుకొంటున్నారు. బస్సుల యాజమాన్యాలు ఇంత నిర్లక్ష్యంగా వ్యవహరిస్తున్నా, దాదాపు 20కు పైగా బస్సులు నిబంధనలు అతిక్రమించి తిరుగుతున్నా రవాణాశాఖ అధికారులు మాత్రం కళ్లు వుండి కబోదుల్లా వ్యవహరిస్తుండడంపై ఆరోపణలు వస్తున్నాయి. బుజబుజనెల్లూరు వరకు ప్రతి బస్సును నడిపే నిర్వాహకులు అక్కడ నుంచి ప్రయాణీకులను ఎక్కించుకుని అయ్యప్పగుడి వరకు తీసుకువచ్చి అక్కడ నిలిపి వేస్తుండడం, తమకు తోచినప్పుడు తిరిగి బస్సులు నడుపుతుండడంతో ప్రయాణీకులు తీవ్ర అవస్థలు పడుతున్నారు. ఇదేమిటని ప్రశ్నిస్తే బస్సు రిపేరంటూ రోజూ ఏదో ఒక కుంటిసాకులు చెప్తూ అక్కడ నుంచి మరో బస్సు ఎక్కిస్తున్నారని వాపోతున్నారు. గతంలో ఆర్టీసి, బుజబుజనెల్లూరు వరకు బస్సులు నడుపుతుండేవి. ఏ కారణం వల్లనో దానిని రద్దు చేసింది. ఇక్కడ వరకు రూటు పర్మిట్ పొందిన వాళ్ల బస్సులు నడపాల్సి వుండగా గత కొంతకాలంగా ఆ నిబంధనలు అతిక్రమించి ఇష్టానుసారంగా బస్సులు నడుపుతున్నా, మితిమీరిన వేగంతో తిరుగుతూ యాక్సిడెంట్లకు కారణమవుతున్నా, ఇష్టానుసారంగా బస్సులు నడుపుతున్నా అటు రవాణాశాఖ, ఇటు ట్రాఫిక్ పోలీసులు పట్టించుకొనే వారే లేకుండా పోవడానికి నెల మామూళ్లు పెద్దమొత్తంలో అందుతుండడమే కారణమన్న విమర్శలు వస్తున్నాయి.

# వెంకయ్యకు ఘన స్వాగతం!

## కేంద్ర మంత్రి అయ్యాక తొలిసారిగా నెల్లూరు వచ్చాడు

కేంద్ర మంత్రిగా బాధ్యతలు చేపట్టి నెల్లూరుకు తొలిసారిగా వచ్చిన ముప్పవరపు వెంకయ్యనాయుడుకు పుర ప్రజలు, బిజెపి కార్యకర్తలు ఘన స్వాగతం పలికారు. 18వ తేది సాయంత్రం నగరానికి వచ్చిన ఆయనకు అయ్యప్పగుడి వద్ద స్వాగతం పలికి అక్కడ నుంచి ర్యాలీ నిర్వహించారు. తప్పెట్లు, తాళాలు, కీలుగుర్రాలు, వివిధ రకాల వేషధారణలతో, బాణాసంచా మోతలతో ఘనమైన, హృదయ పూర్వకమైన స్వాగతం లభించింది. మునిసిపల్ మంత్రి డాక్టర్ పొంగూరు నారాయణ, వైద్య ఆరోగ్య శాఖ మంత్రి కామినేని శ్రీనివాస్, దేవాదాయ శాఖా మంత్రి మాణిక్యరావు, జిల్లా బిజెపి నేతలతో కలసి వెంకయ్యనాయుడు ఓపెన్ టాప్‌వ్యాన్‌పై ఎక్కి ర్యాలీలో పాల్గొన్నారు. అయ్యప్పగుడి నుంచి ప్రారంభమైన ఈ ర్యాలీ అనిల్ గార్డెన్స్ వరకు సాగింది. వేదాయపాళెం, నిప్పో, కరెంట్ ఆఫీస్ సెంటర్ ఇలా ప్రతి సెంటర్‌లోనూ ప్రజలు స్వచ్ఛందంగా వచ్చి జన హృదయ నేతకు పూలజల్లులు, మంగళ హారతులతో స్వాగతం పలికి వెంకయ్యనాయుడిపై తమకు గల అభిమానాన్ని చాటుకొన్నారు. ఈ సందర్భంగా ఎక్కడ చూసినా వెంకయ్యనాయుడికి శుభాకాంక్షలు తెలుపుతూ ఏర్పాటుచేసిన ఫ్లెక్సీలతో నగరమంతా నిండిపోయింది. తెలుగుదేశం కార్పొరేటర్లు, స్థానిక నేతలు సైతం ర్యాలీని నిలిపి గజమాలలతో ఆయన్ను సన్మానించి గౌరవాభిమానాలు తెలియజేశారు.

# దీపం గ్యాస్ కనెక్షన్లకు సరికొత్త మార్గదర్శకాలు!

దీపం పథకం ద్వారా మంజూరు చేసే గ్యాస్ కనెక్షన్లకు కొత్త మార్గదర్శకాలు జారీ కానున్నాయి. ఇప్పటివరకు వున్న పాత విధానానికి స్వస్తి పలికి నూతన మార్గదర్శకాలు అమలు చేయాలని కొత్త ప్రభుత్వం నిర్ణయించింది. గ్రామీణ, పట్టణ ప్రాంతాల్లో నివాసం వుంటున్న పేద ప్రజలు దీపం కనెక్షన్ కోసం దరఖాస్తులు అందిస్తుంటారు. ఇప్పటివరకు వీటిని డిఆర్‌డిఏ, ఇందిర క్రాంతి పథం సిబ్బంది పరిశీలించి గ్యాస్ కనెక్షన్ల మంజూరుకు సిఫార్సు చేసేవారు. మారిన మార్గదర్శకాల ప్రకారం ఇక నుండి పౌరసరఫరాల శాఖ, రెవిన్యూ శాఖ, ఆయిల్ కంపెనీల ప్రతినిధులు దరఖాస్తులు పరిశీలించి కనెక్షన్లు మంజూరు చేస్తారు. అసెంబ్లీ ఎన్నికలకు ముందు దీపం కనెక్షన్ల మంజూరు కోసం గ్రామీణ ప్రాంతాల్లో అధిక సంఖ్యలో దరఖాస్తులు స్వీకరించడం జరిగింది. రాష్ట్రంలో ప్రభుత్వం మారడంతో అప్పుడు స్వీకరించిన దరఖాస్తులు ప్రక్కన పెట్టేశారు. కొత్త మార్గదర్శకాలు జారీ అయిన అనంతరం దరఖాస్తుల్ని స్వీకరిస్తారు. మన జిల్లాకు సంవత్సరానికి దాదాపు 20వేల కనెక్షన్లు మంజూరు చేసే అవకాశం వుందని అధికారులు వివరించారు. సబ్సిడీ క్రింద అందించే దీపం గ్యాస్ కనెక్షన్లకు ప్రభుత్వం 1600 రూపాయలు ఖర్చు చేస్తుంది. గతంలో అనర్హులుగా వున్న వారికి సైతం రాజకీయ సిఫార్సులు కారణంగా కనెక్షన్లు మంజూరు చేశారన్న ఆరోపణలు వున్నాయి. ఈ సారైనా అధికారులు అర్హులను గుర్తించి కనెక్షన్లు మంజూరు చేయాల్సి వుంది.

## బాబు ఒంటెద్దు పోకడ!

మొదటి పేజీ కొరవ

లను కోవడం రాష్ట్ర ప్రయోజనాలకు ఏ మాత్రం సముచితం కాదు.

సామాన్య ప్రజలు కొత్త రాజధానిలో అంగుళం స్థలం కొని, స్థిరపడే పరిస్థితి వుండదు. ఇతర ప్రాంతాల వారు అక్కడ వ్యాపారాలు, సాపారాలు చేసుకొనే వసతి అసలే వుండదు. మరీ ముఖ్యంగా రాయలసీమ వాసులు ఎప్పటికీ దాన్ని తమ స్వంత ఊరిగా భావించలేరు. సాంస్కృతిక వైరుధ్యం అందుకు కారణం.

కొత్త రాజధాని – ఒక పార్టీకి, ఒక నేతకు, ఒక వర్గానికి, ఒక ప్రాంతానికి పరిమితమైన అంశం కాదు. అందరి ప్రయోజనాలు, అందరి భావాలు, అందరి ఆశలు, అందరి భవిష్యత్తు ముడిపడిన అంశం. దానిపై నిర్ణయం రాష్ట్ర ప్రజలందరి అభిప్రాయాలకు అనుగుణంగా వుండాలి. కనీసం, వ్యతిరేకతలను ఉపశమింప చేసే రీతిలో వుండాలి. కొత్త రాజధానులను అప్పటికే అభివృద్ధి చెందిన నగరాలలో కట్టాలన్న నిర్ణయం ఏదీ లేదు. ఎడారి వంటి ప్రాంతంలో కూడా నిర్మించవచ్చు. రాజధానితో పాటుగా ఆ నిర్జన ప్రదేశాలూ అభివృద్ధి చెందుతాయి.

రాజధాని విషయంలో చంద్రబాబు భావాలను కులపరమైన ప్రేరణలు ప్రభావితం చేస్తున్నాయన్న ఆరోపణ కూడా విన్పిస్తున్నది. చాలా ప్రమాదకర పోకడ ఇది. ముఖ్యమంత్రిగా ఈ రోజు చంద్రబాబు వుంటాడు. రేపు వుండడు. కానీ రాజధాని మాత్రం ఎప్పటికీ అట్లనే వుంటుంది. ఒక కులం వారు తనకు ఓటు చేయలేదనే ఆక్రోశంతో ఇంత కీలక నిర్ణయం తీసుకోవడం చాలా పెద్ద పొరపాటు. కులం అనేది ఒక సామాజిక అనాచారం, చెదపురుగు. దాన్ని ప్రామాణికంగా తీసుకోవడం అనేది ఆత్మహత్యా సదృశ్యం.

రాజధాని విషయంలో చంద్రబాబు ఒంటెద్దు పోకడ పోతే, ఎవరి మాటా వినకుండా విజయవాడను నిర్ణయిస్తే – రాయలసీమలో వేర్పాటు ఉద్యమం తలెత్తే ప్రమాదం కొట్టొచ్చినట్లు కన్పిస్తుంది. రాష్ట్రం కులపరంగా చీలిపోయే దౌర్భాగ్యం కళ్ల ముందు భయపెడుతున్నది. నిజానికి రాజధాని నిర్ణయం చంద్రబాబు ఒక్కడిది కాదు. కేంద్రం కూడా అనుమతించాలి. వారు నియమించిన శివరామకృష్ణన్ కమిటీ ఆగష్టు నెలలో తన నివేదిక ఇవ్వబోతున్నది. ఆ కమిటీని ప్రభావితం చేయడానికి చంద్రబాబు తన అధికారాన్ని వాడుతున్నాడు. కేంద్రంలో తన పలుకుబడి ప్రయోగిస్తున్నాడు. కేంద్ర నేతలు ఆయన ఒత్తిడికి తలొగ్గుతారా లేక విశాల రాష్ట్ర ప్రయోజనాల దృష్టితో నిర్ణయం తీసుకొంటారా అన్నది వేచి చూడాలి.

## స్వాగత సత్కారాలు

9వ పేజీ కొరవ

నాయుడును పార్టీలకతీతమైన నేతగా కీర్తించారు. డాక్టర్లు, ఇంజనీర్లు, ఉద్యోగులు, ఛార్టర్డ్ అకౌంటెంట్లు, లెక్చరర్లు, వ్యాపారస్తులు.... సమాజంలో గౌరవ ప్రదమైన వృత్తిలో వున్న వివిధ వర్గాల ముఖ్యులు వేల సంఖ్యలో సభకు వచ్చారు. హాలు పట్టలేదు. మూడున్నర గంటల పాటు కార్యక్రమం నడిస్తే, చిన్నపాటి అలికిడి లేదు. గంభీరంగా, నిండుగా జరిగింది సభ.

మాజీ మంత్రి ఆదాల ప్రభాకర్‌రెడ్డి పౌర సత్కారానికి సారథ్యం వహించారు. సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి, మేకపాటి రాజమోహన్‌రెడ్డి, కోటంరెడ్డి శ్రీధర్‌రెడ్డి, మేయర్ అబ్దుల్ అజీజ్, సిపిఎం నుంచి బి.వి.రమణారెడ్డి, సిపిఐ నుంచి పముజుల దశరథరామయ్య, బిజెపి జిల్లా అధ్యక్షుడు సురేంద్రరెడ్డి, కాంగ్రెస్ తరఫున వాకాటి నారాయణరెడ్డి తదితరులు నాయుడు గారి మీద తమ అభిమానం కురిపించారు. జమీన్‌రైతు పత్రిక సంపాదకుడు నెల్లూరు డోలేంద్ర ప్రసాద్ సన్మాన పత్రం చదివాడు. తిరుమల, రంగనాథస్వామి దేవాలయాల అర్చకులు ఆశీర్వాదం చేశారు. కొన్ని వందల మంది నాయుడు గారి అభిమానులు పుష్పగుచ్ఛాలతో, పూలమాలలతో, శాలువాలతో ముంచెత్తారు. వాటిలో కొన్ని భారీ గజమాలలు. బరువు మోయడం నాయుడు గారికి అలివి కాలేదు. సురభి గాయత్రి బృందం పిల్లలు అందమైన నృత్య ప్రదర్శన చేశారు. రాష్ట్ర ఆరోగ్య మంత్రి కామినేని శ్రీనివాస్ సభకు అధ్యక్షత వహించారు. నాయుడు గారికి గురుతుల్యుడైన పొన్నలూరు సీతారామరెడ్డి వేదిక మీద ఆశీనుడైనాడు.

తనకు ఎంత హృద్యంగా, ఆర్ద్రంగా సత్కారం జరిగిందో అంతే అభిమాన పురస్కారంగా కృతజ్ఞతా ప్రసంగం చేశాడు వెంకయ్యా నాయుడు. మనసు విప్పి మాట్లాడాడు. తనకు చేతనైన, శక్తి ఉన్నంత మేర నెల్లూరుకు మేలు చేస్తానని హామీ ఇచ్చాడు. అందుకు ప్రారంభంగా నెల్లూరు నగరానికి భూగర్భ డ్రైనేజి వసతి, మంచినీటి పథకాల కోసం పదకొండు వందల కోట్ల రూపాయల నిధులు సమకూర్చబోతున్నానని ప్రకటించాడు. పౌర సత్కారానికి గుర్తుగా రంగనాథస్వామి గుడి గోపురాన్ని స్మారక చిహ్నంగా తయారుచేసి, బహూకరించాడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి. నాయుడు గారి పట్ల తనకున్న ప్రేమను వ్యక్తం చేయడానికి తన కన్వెన్షన్ సెంటర్‌లో షడ్రసోపేతమైన విందు ఏర్పాటు చేశాడు వేమిరెడ్డి ప్రభాకర్‌రెడ్డి.

# నెంబర్ టూ నారాయణే!



మునిసిపల్ మంత్రి పి.నారాయణ రాజకీయ ప్రాభవం అనూహితంగా పెరిగిపోతున్నది. రోజు రోజుకూ శిఖర స్థాయికి చేరుకొంటున్నది. నారాయణకు చంద్రబాబు మంత్రివర్గంలో స్థానం లభించినప్పుడు, ఇన్నేళ్ల సహచర్యానికి కృతజ్ఞతగా బహుమానం ఇచ్చాడు అనుకొన్నారు అందరూ. నారాయణ మంత్రిత్వం బదులు వైఎస్ హయాంలో కెవిపి వలె ఏదో ఒక సలహా దారుడు పదవి తీసుకొని, చంద్రబాబుకు దగ్గరగా వుంటే బాగుండేది కదా అని సలహాలు కూడా ఇచ్చారు. కానీ నెలన్నర తర్వాత పరిస్థితి చూస్తే, నారాయణ మీద అభిమానంతో కాక, నమ్మకంతో తన మంత్రివర్గంలోకి తీసుకొన్నారని అర్థమై పోతున్నది. ఆయనకు రాజకీయ అనుభవం వున్నా లేకపోయినా, అవగాహన వున్నా లేకపోయినా, పరిణితి వున్నా లేకపోయినా రాజకీయంగా తన పక్కన వుంచుకోవాలన్న నిర్ణయంతోనే చంద్రబాబు నారాయణను అందలం ఎక్కించాడని అర్థమై పోతున్నది.

ఇప్పుడు నారాయణ కేవలం మునిసిపల్ మంత్రి కాదు. మంత్రివర్గంలో ముఖ్యమంత్రి తర్వాత ముఖ్యమంత్రి అంతటివాడు. ఆయన్ను కేవలం మునిసిపల్ శాఖకు పరిమితం చేయడం లేదు ముఖ్యమంత్రితో సమానంగా అన్ని శాఖల మీద ఆధిపత్యం ఇస్తున్నారు. కొత్త రాష్ట్రంలో కీలక అంశం – రాజధాని నిర్మాణం. దానికి నారాయణను సర్వం సహాధికారిని చేశాడు చంద్రబాబు. ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ శాఖను అనధికారికంగా అప్ప చెప్పాడు. ఆ శాఖ అధికారులందరూ నారాయణకు రిపోర్టు చేయాలని, అక్కడ నుంచే ఆదేశాలు తీసుకోవాలని ఉత్తర్వులిచ్చాడు. కొత్త రాజధాని నిర్మాణ సలహా సంఘానికి నారాయణను ఛైర్మన్‌గా నియమించారు. రాష్ట్ర ఆర్థిక పరిస్థితి మీద విడుదల చేస్తున్న శ్వేతపత్రాల పెత్తనమూ నారాయణదే. డిజిపి, చీఫ్ సెక్రటరీలు నిత్యం నారాయణను సంప్రదిస్తున్నారు. అధికారుల బదలీలలో కూడా సలహాలు తీసుకొంటున్నారు. రాష్ట్రానికి కేంద్ర ప్రభుత్వం ఇవ్వబోతున్న 7 ఉన్నత విద్యా సంస్థల ఏర్పాటుపై నిర్ణయాలన్నీ నారాయణవే. ఎక్కడ పెట్టాలి, ఎంత స్థలం సేకరించాలి ఏ ఏ అంశాలలో విద్యాబోధన జరగాలి వంటి విషయాలలో నారాయణ ఏది చెప్తే అదే అమలు జరుగుతున్నది.

ఒక్కమాటలో చెప్పాలంటే రాష్ట్ర పునర్నిర్మాణంలో నారాయణకు కీలక పాత్ర ఇస్తున్నాడు చంద్రబాబు.

వీటన్నిటివల్లా నారాయణకు క్షణం తీరిక దొరకడం లేదు. నిద్ర లేచీ లేవగానే చంద్రబాబు ఇంటికి, అక్కడ నుంచి లేక్‌వ్యూ అతిథి గృహానికి పరుగులు పెట్టవలసి వస్తున్నది. రాత్రి వరకు అదే డ్యూటీ. చంద్రబాబు ఎక్కడ వుంటే అక్కడ. ఏ సమావేశంలో పాల్గొంటూ వుంటే అందులో. ముఖ్యమంత్రికి కో పైలట్ వలె వ్యవహరించక తప్పడం లేదు. గతంలో నాదెండ్ల భాస్కరరావు వంటివారు కూడా కో పైలట్ అన్న పేరు తెచ్చుకొన్నారు. అయితే అది పూర్తిగా రాజకీయపరమైనది. కానీ నారాయణది నూటికి నూరుపాళ్లు పరిపాలనాపరమైన సహచర్యం.

నారాయణ మొదట నుంచి కూడా కష్ట జీవి. శ్రమను మాత్రమే నమ్ముకొని జీవితంలో పైకి ఎదిగిన వాడు. ఉదయం 5 గంటలకు నిద్ర లేస్తే అర్ధ రాత్రి పన్నెండు గంటల వరకు కష్టం చేయాల్సిందే. పగలు పని, రాత్రి ప్రయాణం. వేల కిలోమీటర్ల దూరం కారులో ప్రయాణం చేయక తప్పని స్థితి. వెయ్యి కోట్ల రూపాయల టర్నోవర్ కల్గిన విద్యా వ్యాపార సామ్రాజ్యాన్ని సృష్టించినా – పొట్లంలో కట్టిన అన్నం తినడం, కారులోనో రైలులోనో నిద్రపోవడం తప్ప ఇంటి పట్టున వుండే సావకాశమే లేదు. అంత కష్టం చేసి పైకి ఎదిగిన శ్రమజీవి నారాయణ. ఆయనలోని మరొక సుగుణం – ఎవరినీ ద్వేషించక పోవడం. తనకు గిట్టకుంటే దూరం జరిగిపోవడం తప్ప ఎవరి మీదా కక్ష కట్టి ప్రవర్తించడం, కోపగించుకోవడం తెలియదు. అందరితో మంచిగా వుండడానికే ప్రయత్నం చేస్తాడు. ఎవరి దగ్గరా భేషజం చూపడు. అవసరానికి మించి అణిగిమణిగి వుంటాడు. ఈ వినయ సంపద, ఈ కష్టం చేసే మనస్తత్వం చంద్రబాబుకు బాగా నచ్చినట్లున్నాయి. అందువల్లనే నారాయణను రాజకీయంగా ఆకాశంలో నిలబెట్టాడు. అయితే దాన్ని కాపాడుకోవడం చాలా కష్టమైన విషయం. ఏ మాత్రం కాలు జారినా పడేది – పాతాళంలోనే. నారాయణ ఆ విషయాన్ని అనుక్షణం గుర్తు పెట్టుకోక తప్పదు.

## నెల్లూరు ముచ్చట్లు

3వ పేజీ కొరవ

### మా మాష్టారు నారాయణ

నన్ను జడ్పీ ఛైర్మన్ కానీయకుండా ఎన్ని కుట్రలు పన్నినా మున్సిపల్ మంత్రి డాక్టర్ నారాయణ నాకు మ్యాథ్స్ పాఠాలు చెప్పిన గురువుగా గౌరవిస్తానని జడ్పీ ఛైర్మన్ బొమ్మిరెడ్డి రాఘవేంద్రరెడ్డి వ్యాఖ్యానించారు. లక్కీడాలో జడ్పీపీఠాన్ని కైవసం చేసుకొన్న అనంతరం ఆయన ఆత్మకూరు వెళ్లి అక్కడి వెంకటేశ్వరస్వామి గుడిలో ప్రత్యేక పూజలు చేశారు. ఈ సందర్భంగా రాఘవ మాట్లాడుతూ మంత్రి నారాయణ సహజంగా మంచివాడని, కొంతమంది ఆయన్ను తప్పుదోవ పట్టించి జడ్పీ ఎన్నికల్లో అక్రమాలకు పాల్పడేలా ప్రోత్సహించారన్నారు. నన్ను జడ్పీ ఛైర్మన్ కానీయకుండా చూసినా నారాయణంటే గౌరవభావమే వుందని తన గురుభక్తిని చాటుకొన్నారు.

### వెంకయ్యకు నారాయణ పాదాభివందనం!

కేంద్ర మంత్రి వెంకయ్యనాయుడుకు మున్సిపల్ మంత్రి నారాయణ పాదాభివందనం చేసి ఆయన పట్ల తనకుగల గౌరవాన్ని చాటుకొన్నారు. అనిల్ గార్డెన్స్‌లో బిజెపి నిర్వహించిన వెంకయ్యనాయుడు సన్మాన కార్యక్రమంలో పాల్గొన్న మంత్రి నారాయణ వెంకయ్యనాయుడు అందరికీ ఆదర్శమంటూ ప్రసంగిస్తూ పాదాభివందనం చేయడం అక్కడకు వచ్చిన వారందరినీ ఆశ్చర్యపరిచింది. సాధారణంగా వెంకయ్యనాయుడుకు పాద నమస్కారాలు చేయడం నచ్చదు. పలువురిని ఆయన వారించాడు. కానీ మంత్రి పాదనమస్కారం చేయడంతో ఏమీ అనలేక గమ్మునుండి పోయాడు.

### రైల్వేస్టేషన్‌లో ఎస్కలేటర్ సౌకర్యం

నెల్లూరు ప్రధాన రైల్వే స్టేషన్‌లో ఎస్కలేటర్ సౌకర్యాన్ని అందుబాటులోకి తెచ్చారు. కొత్తగా ఏర్పాటుచేసిన దీన్ని కేంద్ర మంత్రి వెంకయ్యనాయుడు ఇటీవల ప్రారంభించి దానిపై నిలబడి ఫ్లాట్‌ఫామ్‌పైకి చేరుకొన్నారు. ప్రయాణీకులు రైల్వే శాఖ కల్పించే సదుపాయాలను సద్వినియోగం చేసుకోవడంతోపాటు స్టేషన్ పరిసరాలు పరిశుభ్రంగా వుంచాలని కోరారు. పనిలోపనిగా కార్యకర్తలు, అనుచరులకు చురకలు అంటించారు. ఏ నేత వచ్చినా స్వాగతించేందుకు రైల్వేస్టేషన్‌కు వచ్చేవాళ్లు విధిగా ప్లాట్‌ఫాం టిక్కెట్ కొనాలని సూచించారు. స్టేషన్‌లో ఎస్కలేటర్ సౌకర్యాన్ని కల్పించడం సంతోషించే అంశమే అయినా దీన్నయినా రైల్వే అధికారులు సక్రమంగా నిర్వహిస్తారో లేక నిత్యం మొరాయించే లిఫ్ట్‌లాగే చేస్తారో చూడాలి?

### డిఎస్పీ శ్రీనివాసులు నాయుడికి మాతృవియోగం

నెల్లూరు నగరంతోపాటు జిల్లాలోని పలు పోలీస్ స్టేషన్‌లలో ఎస్‌ఐగా, విజిలెన్స్ శాఖలో సిఐగా, రైల్వేశాఖలో డిఎస్పీగా పని చేసి మంచి మనిషిగా పేరు తెచ్చుకున్న డిఎస్పీ శ్రీనివాసులు నాయుడు తల్లి గుంటుపల్లి పుష్పావతి (74) 18వ తేదీ మరణించారు. ఈమెకు ఇద్దరు కుమారులు, ఇద్దరు కుమార్తెలు వున్నారు. మాతృమూర్తిని కోల్పోయిన శ్రీనివాసులు నాయుడికి మా సానుభూతి.

## పదరంగం -121

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | | 4 | | 5 | 6 |
| | | 7 | | | | 8 | 9 | | |
| 10 | 11 | | | 12 | | | | | |
| | 13 | | 14 | | | | 15 | 16 | |
| 17 | | | 18 | | 19 | | 20 | | 21 |
| | | 22 | | | 23 | 24 | | 25 | |
| | | | | | 26 | | 27 | | |
| | 28 | | | 29 | | 30 | | | 31 |
| 32 | | | | 33 | 34 | | | 35 | |
| 36 | | | | 37 | | | | 38 | |

**అడ్డం**

1. సుగంధం, సువాసన (3)
3. మిగిలిన, శేషం (3)
5. నిలువు ఐదు (2)
7. సింహాసనం (2)
8. నివారించడం (4)
10. అటునుంచి బంధము తాడు (3)
12. ఉదాహరణ (4)
13. మృదువాక్కు కాదు (4)
15. సమావేశం (2)
17. వీలు, వాలు భాగం (2)
18. సులభం (3)
20. దక్షిణ దిశాధిపతి (3)
22. వాయసం (2)
23. తెలుగు టేస్ట్ (2)
25. అటునుంచి పందుకు ముందు రూపం (2)
26. జగడం (3)
28. గాయకుడు ఏం చేస్తాడు (2)
30. అటునుంచి నఖము (2)
32. మంత్రం కాదు (2)
33. ఎర్రని అందమైన కూరపండు (3)
35. నీటిలో విన్యాసం (2)
36. కుమార్తె (3)
37. ఉపాయం (3)
38. పెన్ను (2)

**నిలువు**

1. భవంతి (3)
2. అవమానం (4)
4. స్త్రీ, అతివ (3)
5. మట్టిని త్రవ్వే సాధనం, గడ్డ పలుగుతోపాటుది (2)
6. యుద్ధము (3)
9. తబడిన వాయసము (4)
11. బండి (3)
12. చూపులు (3)
14. సర్పరాజు, కద్రువ కుమారుడు (3)
16. తడబడిన భయము (3)
17. కోతి, కపి (3)
19. క్రింద నుంచి వృక్షము (3)
21. క్రింద నుంచి బరియల్ గ్రౌండ్ (2)
22. అడవి (3)
24. లేలేత ఆకు (5)
27. క్రింద నుంచి గోమాత (2)
28. మంత్ర విశేషం (3)
29. రామలక్ష్మణులు చంపిన రాక్షస స్త్రీ (3)
31. గగన తలం కాదు (3)
32. మరుసటి రోజు రేపు తర్వాతి రోజు(2)
34. నాజూకు కాదు (2)
35. తెలుగు ఫెదర్ (2)

**సమాధానాలు**

## పదరంగం -120

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 ఉ | 2 ప | 3 యు | క్తం | | 4 ద | ర్ప | 5 ణం | | 6 వి |
| 7 వి | ర | క్తి | | 8 ఆ | శా | | 9 ప్రా | 10 య | ము |
| 11 ద | ము | | 12 వే | కు | వ | | | 13 మ | ఖ |
| లు | | 14 కా | స | | 15 తా | 16 సం | 17 నం | | ము |
| | 18 భా | ర | వి | | 19 ర | యు | వి | | |
| 20 వి | ను | త | | 21 ఆ | ము | క్త | మా | ల్య | 22 ద |
| 23 క | డు | | 24 గో | వు | లు | | | | శ |
| ట | | 25 తా | డు | పా | | 26 వెం | 27 డి | తె | ర |
| 28 క | 28 ల | ప | | 30 లు | 31 వే | డి | వ | | ఘు |
| 32 వి | ల | సి | ల్లు | | ట | | 33 కా | లు | డు |

## 2014 సర్వేపల్లి నియోజకవర్గ ఓట్ల వివరాలు

| బూత్ నెం | పోలింగ్ కేంద్రం | పోలైన ఓట్లు | వైఎస్ఆర్ సిపి | టిడిపి | కాంగ్రెస్ |
|---|---|---|---|---|---|
| 165ఎ | చెముదుగుంట | 513 | 204 | 289 | 5 |
| 166 | చెముదుగుంట | 821 | 261 | 515 | 11 |
| 167 | చెముదుగుంట | 501 | 228 | 251 | 7 |
| 168 | కాకుటూరు | 777 | 402 | 349 | 5 |
| 169 | కాకుటూరు | 530 | 253 | 255 | 5 |
| 170 | కంటేపల్లి | 680 | 359 | 299 | 3 |
| 170ఎ | కంటేపల్లి | 664 | 315 | 301 | 6 |
| 171 | గొలగమూడి | 766 | 345 | 395 | 5 |
| 172 | గొలగమూడి | 991 | 406 | 528 | 10 |
| 173 | అనికేపల్లి | 917 | 476 | 409 | 0 |
| 174 | అనికేపల్లి | 776 | 404 | 333 | 3 |
| 175 | తిక్కవరప్పాడు | 748 | 348 | 343 | 5 |
| 176 | తిక్కవరప్పాడు | 586 | 226 | 334 | 5 |
| 177 | జోసఫ్‌పేట | 959 | 525 | 405 | 4 |
| 178 | సర్వేపల్లి | 906 | 474 | 397 | 7 |
| 179 | సర్వేపల్లి | 734 | 358 | 343 | 3 |
| 180 | సర్వేపల్లి-2 | 774 | 406 | 332 | 5 |
| 181 | రామదాసుకండ్రిగ | 801 | 379 | 401 | 3 |
| 182 | ఇడిమేపల్లి | 626 | 214 | 387 | 2 |
| 183 | ఇడిమేపల్లి | 716 | 233 | 441 | 6 |
| 184 | ఈదగాలి | 839 | 318 | 467 | 11 |
| 185 | ఈదగాలి | 726 | 326 | 358 | 12 |
| 186 | పూడిపర్తి | 1044 | 500 | 494 | 8 |
| 187 | పూడిపర్తి | 702 | 429 | 248 | 2 |
| 188 | ఎగువమిట్ట | 794 | 316 | 455 | 7 |
| 189 | తాటిపర్తిపాళెం | 881 | 472 | 387 | 4 |
| 190 | ఇస్కపాళెం | 661 | 379 | 257 | 6 |
| 190ఎ | ఇస్కపాళెం | 606 | 323 | 269 | 3 |
| 191 | నిడిగుంటపాళెం | 783 | 373 | 377 | 8 |
| 192 | నిడిగుంటపాళెం | 930 | 397 | 488 | 7 |
| 193 | పుంజులూరిపాడు | 625 | 382 | 219 | 9 |
| 194 | గుడ్లూరివారిపాళెం | 956 | 417 | 506 | 10 |
| 195 | గుడ్లూరివారిపాళెం | 658 | 358 | 276 | 4 |

## 2014 సర్వేపల్లి నియోజకవర్గ ఓట్ల వివరాలు

| బూత్ నెం | పోలింగ్ కేంద్రం | పోలైన ఓట్లు | వైఎస్ఆర్ సిపి | టిడిపి | కాంగ్రెస్ |
|---|---|---|---|---|---|
| 196 | తిరుమలమ్మపాళెం | 1136 | 619 | 475 | 5 |
| 197 | గొట్లపాళెం | 497 | 125 | 333 | 4 |
| 198 | వడ్లపూడి | 509 | 139 | 358 | 2 |
| 199 | రాజావోలుపాడు | 454 | 149 | 296 | 4 |
| 200 | వీరంపల్లి | 1189 | 784 | 362 | 8 |
| 201 | కొండుపాళెం | 828 | 372 | 398 | 10 |
| 202 | అక్కంపేట | 808 | 449 | 326 | 3 |
| 203 | మడమనూరు | 843 | 290 | 513 | 3 |
| 204 | మడమనూరు | 913 | 316 | 523 | 12 |
| 205 | మడమనూరు | 671 | 354 | 288 | 7 |
| 206 | చెర్లోపాళెం | 952 | 524 | 377 | 8 |
| 207 | జట్లకొండూరు | 1120 | 640 | 449 | 6 |
| 208 | బండేపల్లి | 477 | 244 | 226 | 4 |
| 209 | చెరుకుమూడి | 612 | 226 | 341 | 11 |
| 210 | ముద్దుమూడి | 474 | 175 | 284 | 1 |
| 211 | కొమ్మలపూడి | 489 | 260 | 218 | 1 |
| 212 | కొమ్మలపూడి | 699 | 358 | 314 | 9 |
| 213 | గురువిందపూడి | 854 | 643 | 196 | 2 |
| 214 | కాగితాలపూరు | 1117 | 456 | 595 | 12 |
| 215 | పిడూరు | 698 | 363 | 316 | 3 |
| 216 | పిడూరు | 514 | 224 | 262 | 8 |
| 217 | లక్ష్మీనరసింహపురం | 609 | 250 | 329 | 4 |
| 218 | మనుబోలు | 918 | 335 | 523 | 18 |
| 219 | మనుబోలు | 1023 | 514 | 435 | 30 |
| 220 | మనుబోలు | 716 | 372 | 308 | 4 |
| 221 | మనుబోలు | 836 | 412 | 393 | 10 |
| 222 | మనుబోలు | 606 | 317 | 253 | 9 |
| 223 | మనుబోలు | 800 | 381 | 375 | 10 |
| 224 | వెంకన్నపాళెం | 831 | 465 | 335 | 12 |
| 225 | బద్దెవోలు | 1164 | 465 | 669 | 8 |
| 226 | పిడూరుపాళెం | 764 | 339 | 417 | 0 |
| 227 | కట్టువపల్లి | 798 | 509 | 233 | 43 |
| 228 | కొలనుకుదురు | 813 | 450 | 319 | 5 |

# ఈశాన్యపు గదిలో దేవుడు తూర్పు చూడాలి!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*ప్రవల్లిక — బెంగుళూరు*

* *చాలా ఇళ్లలో దేవుడి గదులు పశ్చిమం చూస్తుంటాయి. మీరీ అంశాన్ని ఒప్పుకోరుకదా?*

ఈశాన్యపు గదిలో దేవుడు తూర్పు చూడాలి. ఈశాన్యంలో దేవుడు అనే అసంబద్ధపు ప్రచారం వల్ల ఈ దురదృష్టకర పరిస్థితులు ఏర్పడుతున్నాయి.

*షేక్ షరీనా బేగం — బెంగుళూరు*

* *యంత్ర ప్రతిష్ట వల్ల మా కుటుంబం అనేక సమస్యల నుండి బయట పడింది.*

యంత్రాన్ని ఏ మతం, ఏ దేవుడి పేర ప్రతిష్ఠించుకొన్నా, పూజించిన అది శక్తివంతమవుతుంది. అందువల్ల మీ సమస్యలు పరిష్కరించబడ్డాయి. నమ్మకం అద్భుతాలు సృష్టిస్తుంది.

*పి.శ్రీనివాసరావు — కందుకూరు*

* *సమాజంలోని స్త్రీ, బాల, వృద్ధుల దుస్థితులను కర్మసిద్ధాంతంతో సరిపెట్టుకోమంటారా?*

అవసరం లేదు. మీ పరిధిలో మీ సహాయ సహకారాలు వారికి అందించండి. వారి విషయం అధికారుల దృష్టికి తీసుక వెళ్లండి. భగవద్గీతలో కృష్ణ పరమాత్మ అంటాడు కదా? శాస్త్రాంశాల్ని గౌరవిస్తూనే మానవులు తమ కర్తవ్య పాలన చేయాలి అని.

*ఎం.డి.శిరీష్ — బెంగుళూరు*

* *'చేతబడి' చేశారని అనుమానంగా వుంది. తరుణోపాయం చెప్పండి?*

'చేతబడి' క్షుద్ర విద్యల్లో ప్రధానమయ్యింది. దాన్ని అభ్యసించడం ప్రయోగించడం చాలా కష్టతరమైన విషయం. ఇప్పుడు అంతటి నిష్ఠాగరిష్టులు కూడా లేరు. అనుమానం పెనుభూతం అంటారు కదా? దాన్ని నమ్మకండి. నమ్మితే అది మానసిక సమస్య అవుతుంది.

*షేక్ రజియాబేగం — సికింద్రాబాద్*

* *సంవత్సరం పాపకు ఈ వ్యాధి ఏమిటి? లోపం జ్యోతిషంలోనా? వాస్తు దోషాలలోనా?*

కర్మ ఫలితం వల్లే జన్మలూ, వ్యాధులూ ఏర్పడుతుంటాయి. పాప వ్యాధిని వైద్యులు ఆపరేషన్ ద్వారా దూరం చేశారు కదా? అది కూడా భగవంతుడి అనుగ్రహమే. జ్యోతిష నివేదికలో కూడా నాకు ఈ అంశాలే కనిపించాయి.

*ఎ.శారద — బెంగుళూరు*

* *వాస్తు దోషాలేవీ లేవు. అయినా సమస్యలు ఉక్కిరి బిక్కిరి చేస్తున్నాయి.*

మీ ప్లానులో మూడు ద్వారాలు ఎదురెదురుగా వున్నాయి. మూడవది రాక్షస ద్వారం (భూత) అవుతుంది. త్రిజ్యేష్ఠా నక్షత్రాలు ఎంత హాని చేస్తాయో, మూడు ద్వారాల ముప్పు కూడా అంతే వుంటుంది.

